అంతర భారతీయ పుస్తకమాల

# బిల్లేసుర బకరిహా

రచన

సూర్యకాంత త్రిపాఠి 'నిరాలా'

అనువాదం

బాలశౌరి రెడ్డి



నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా

# పీఠిక

నిరాలా (1899-1961) భావకవిత్వం (ఛాయావాదము) ఉద్యమంలో ఒక గొప్పకవిగా పేరు ప్రఖ్యాతులు సముపార్జించుకున్నాడు. అంతేకాదు భావక విత్వపు హద్దులను అతిక్రమించి అభ్యుదయ (యధార్థవాదం) వాదాన్ని కొత్త కోణాలలో సంతరింపజేశాడు. వీటి ఛాయలు మనకు "కుకుర్ ముత్తా", "నయే పత్తే" కవితాసంపుటాలలోనూ మరియు "చతురీచమార్", "కుల్లీభాట్", "బిల్లే సురబకరిహ" లాంటి కథా కృతులలోను ప్రస్ఫుటంగా కన్పిస్తాయి. నిరాలా రచనాకాలము 20 వశతాబ్దపు నాలుగు దశాబ్దాలలో వ్యాపించి వుంది. అకా లము జాతీయ ఉద్యమము పోరాటాల అనుభవాలతో నిండిఉంది. నిరాలా లోని స్వాతంత్రేచ్ఛ ఆయన సంపూర్ణ రచనలలో ప్రతిఫలిస్తోంది. "పరిమళ" (1929) కావ్యసంపుటి పీఠికలో నిరాలాగారు "కావ్య స్వచ్ఛందత"ను గూర్చిన ప్రశ్నను లేవదీశారు. "కుల్లీభాట్" మరియు "బిల్లేసురబకరిహ" ఆ పద్ధతి నవలలు. "నవలా స్వేచ్ఛ"ను ప్రతిపాదించాయి. పరంపరా గతమైన పద్ధతులకు స్వస్తి చెప్పి ఒక కొత్త కధా స్వరూపాన్ని అన్వేషించే ప్రయత్నాలకు యివి ఉత్తమ మైన ఉదాహరణలుగా భావించవచ్చు. హస్య-వ్యంగ్యరీతులతోపాటు వ్యధా జనితమైన యధార్ధగాధలకు ప్రతిరూపాలుగా చిత్రింపబడ్డాయి.

"బిల్లేసుర బకరిహ" నిరాలాగారి భారతీయత మూర్తీభవించిన ఒక విల క్షణమైన నవల. పథమ ముద్రణ పీఠికలో నిరాలాగారు ఈ రచనను "హస్యంతో కూడుకొన్న ఒక స్కెచ్" గా అభివర్ణించారు. ఆకారణంగానే చాలా సంవత్సరాల వరకు ఈ కృతిని రేఖాచిత్రాత్మక నవలగా పేర్కొనడం జరిగింది. నాలుగవ దశాబ్దపు చివరిభాగంలో లేక 5వ దశాబ్దపు ప్రారంభంలో ఈ నవల - నవలా స్వరూపంలో ఒక వినూతనమైన మార్పుకు నాందిగా భావించ వచ్చు. గ్రామీణ హస్య-వినోదాలతో కూడుకున్న ఈకృతి రచనా ప్రక్రియలో ఒక తమాషాగా ఆకృతి పొందగల్గింది. యిందులో బిల్లేసురుని జీవన పోరాటంలోని వ్యధా-గాధ మర్మ గర్భంగా దాగివుంది. చివరిభాగం జానపదశైలిలో సుఖాంతంగా

కన్పించినా, సమగ్ర స్వరూప చిత్రణలో అది ఒక కఠోరమైన జీవన పోరాట గాధగా రూపుదిద్దుకొంది.

"బిల్లేసుర బకరిహ" 1942లో ప్రచురింపబడింది. ఆ సంవత్సరమే నిరాలాగారి దీర్ఘకవిత "కుకుర్‌ముత్తా" ముద్రణ పొందింది. ఆ కావ్యాన్ని ఆభిజాత్యా హంకారానికి వ్యతిరేకంగా ఒక తిరుగుబాటుగా భావింపవచ్చు. "బిల్లేసుర బకరిహ" రచనలోని రెండు అంశాలు 1939లో "రూపాభ్" అనే పత్రికలో చోటుచేసుకున్నాయి. ఈ రచన రెండవ ముద్రణ 1945లో పొందింది. ఆ రచన పీఠికలో నిరాలా ఈ కృతిని "అభ్యుదయ రచనకు నమూనా"గా పేర్కొన్నారు. ఈ రచనా స్వరూపం బాహ్యరూపంలోనే వాటి అంగవిన్యాసం సూచింపబడినదని భావించవచ్చు. అది అభ్యుదయ వాఙ్మయానికి ప్రథమ సోపానమని చెప్పారు. కళాత్మకంగా చూచినట్లయితే ఈ రచన మూడు చిన్న-పెద్ద కథల సమాహారం. కథాంశం సమాప్తం చెంది కూడా అసంపూర్ణంగా వుండిపోయింది. ఆకారణంగా పాఠకుడు చలంచిపోతాడు. కానీ అతనికి స్ఫూర్తి లభిస్తుంది. యధార్థంలో నిరాలా నవల అంతఃస్వరూపాన్ని గురించియేగాక బాహ్య రూపకల్పనలో కూడా జాగ్రత్త వహించాడు. నిరాలా భావనలో "ఏదైనా ఒక నదీప్రవాహానికి అడ్డకట్టుగా ఒక ధృడమైన పునాది మీద తన స్వరూపాన్ని ఆవిష్కరించుకున్నప్పుడే ఆరచనకు ఒక కొత్త సారస్వత ధృడత్వం లభిస్తుందన్న మాట అటుంచి సమాజానికి ఒక వికాసప్రధానమైన జీవనం లభించడం కూడా దుర్లభం కాగలదు. ఈ దృష్ట్యా 'బిల్లేసుర బకరిహ' స్వాభావికంగానే హిందీ నవలారంగానికి ఒక కొత్త అధ్యాయమని చెప్పవచ్చు."

"బిల్లేసుర బకరిహ" రచనకు పూర్వం నిరాలాగారి "కుల్లీభాట్" అనే నవల 1939లోనే ప్రచురింపబడింది. గ్రామీణ జానపద హస్యజల్లులు ఈ రెండు నవలలోనూ సహజంగానే చోటు జేసుకున్నాయి. కుల్లీ, బిల్లేసుర లాంటి పాత్రలు అవధ ప్రాంతంలోని జనపదాల్లో లభించాయి. బిల్లేసుర్ "బిల్లేశ్వర" పేరుకు వికృతరూపము. ఆ పేరుతో కూడుకొన్న "బకరిహ" శబ్దము సంకేతం మాత్రమే. జీవనోపాధి కొరకు నౌకరీ గానీ, రైతుల పొలంపనిగానీ లాభించని కారణంగా బ్రాహ్మణ వంశంలో జన్మించిన శుక్లవంశస్థుడు బిల్లేసురుడు మేకలు పెంచే వృత్తిని అవలంభించాడు. తన వైఫల్యానికి అనుకూలమైన తర్కాన్ని అన్వేషించడంలో అతనికి ఏ మాత్రము అలస్యంకాలేదు. తన్నుతాను సమర్థించు కున్నాడు - "విధిలేని పరిస్థితుల్లో బ్రాహ్మణులు పొలము దున్నుకుంటున్నారు, చెప్పుల దుకాణాలు నడుపు కుంటున్నారు.

అలాంటి పరిస్థితిలో మేకలు పెంచడంలో తప్పేమిటి?" తన తండ్రి మరణా నంతరం కుటుంబం విచ్ఛిన్నం కావడంతో బిల్లేసురుడు కలకత్తా వెళ్లాలని నిశ్చయించుకొని టిక్కెట్ కొనకుండానే రైలులో కూర్చున్నాడు. మధ్యలో దింపబడ్డాడు. నిరాలా ఆసంఘటనను యిలా వర్ణించాడు. - "బిల్లేసురుడు భారతీయ వాతావరణాన్ని అనుసరించి సవినయంగా చట్టాన్ని అతిక్రమిం చాడు. అతనేమి ప్రతి వాదము చేయక మౌనంగా రైలు దిగివచ్చాడు. కానీ తన సిద్ధాంతాన్ని మాత్రం వదలలేదు." చివరికి అతను వర్దవాన్ (బర్ద్వాన్) మహారాజుగారి కొలువులో జమేదారుగావున్న సత్తీదీన్ సుకుల్‌వద్ద చేరాడు. కనౌజియా బ్రాహ్మణకులంలో అతను బిల్లేసురకంటే ఉన్నత శ్రేణికి చెందిన వాడు. రాజుగారి కొలువులో బిల్లేసురునికి ఉత్తరాలు తీసుకవెళ్లే పని లభించింది. ఆపనికూడా తాత్కాలికమే. సత్తీదీన్ సుకుల్ భార్య బిల్లేసురునికి మరో పని పురమా యించేందుకు పూర్వము తనవద్ద పనికి కుదిరిన పశువుల కాపరిని తొలగించివేసింది. బిల్లేసురుడు చలించిపోయాడు. పశువుల కాపరిగా వుండా లను కుంటే అతనికి యింతదూరం రావలసిన అగత్యమే లేదుకదా! బిల్లేసు రుడు ధృడనిశ్చయం గలవాడు. ఏ లాంటి పరిస్థితినైనా ఎదుర్కొనే సహన శక్తిని అతను తనవూరిలోనే సంపాదించికో గలిగాడు. నిరాలా యిలా అంటాడు - "బిల్లేసురుడు ఏమాత్రం నోరువిప్పలేదు. తన జీవిత పుస్తకాన్ని చదువుక పోతున్నాడు, అతడు ఏలాంటి వైజ్ఞానికుని కన్నా గొప్పనాస్తికుడు. అతడు యితరులను శంకిస్తూ చివరకు ఒక వినూతనమైన స్వభావాన్ని అలవరచు కున్నాడు. కానీ తన శక్తిని వదలుకోలేదు - ఒంటరి గజ ఈతగాడిలాగా!"

బిల్లేసురుడు ఒక స్థిరమైన ఉద్యోగంతో పాటు పదోన్నతి పొందాలని సంకల్పించి నానా ప్రయాసలు పడ్డాడు. అబద్దాలాడాడు. సంతాన ప్రాప్తికి సత్తాదీన్ సుకుల్ భార్యతో కలసి జగన్నాధుని దర్శించేందుకు పూరీవెళ్లాడు. మిధ్యాస్వప్నాన్ని ఆశ్రయించి గురు మంత్రంపొందాడు. కానీ తన కోర్కె ఫలించలేదు. పైగా అతడు విసిగి వేసారి పోయాడు. అతని మనోప్రవృత్తిని నిరాలా యిలా వర్ణంచాడు - "గురువు భార్య యధార్ధవాదము అతనికి రుచిం చలేదు. ఒకరోజున మెడలోని రుద్రాక్షమాలను ఆమె ఎదుటనే విసరిపార వేసి తన గ్రామం చేరుకున్నాడు. వ్యవసాయవృత్తి అవలంభించాలను కున్నాడు. మేకలు కొన్నాడు. గురుమంత్రానికి ఏనాడో స్వస్తిచెప్పాడు గదా! కానీ మేకల రక్షణ కోసం మహావీరహనుమాన్ విగ్రహంపట్ల విశ్వాసం, భక్తిపెంచుకున్నాడు. బిల్లేసురుడు ఆనాటి వరకు తన బ్రతుకు బాటలో కష్టాలే ఎదుర్కొన్నాడు.

యిప్పుడతడు కొద్దిగా నిలదొక్కుకున్నాడు. తన దృష్టినంతా తనలక్ష్యం పైనే సారించాడు. నిరాలా అంటాడుగదా - మన ఈ సోక్రటీసుకు నాలుకలేదు. కానీ అతని పిలాసఫీ ఆధార విహీనమైనది ఏమాత్రం కాదు. అయితే అతని మాట ఆలకించే వారు ఎవరూలేకపోయారు. అతనికి ఆ వ్యూహం నుండి బయటపడే దారి కనిపించలేదు. అందుచేతనే అతడు పథభ్రష్టుడైనాడు."

ఈ జీవిత పోరాటంలో రెండవ పర్యాయం తన గ్రామం చేరుకున్నప్పుడు బిల్లేసుర్‌నికి తను శత్రు మూకల మధ్య చేరుకున్నట్లు తోచింది. నివాసానికి తనకు ప్రాప్తమైన యిల్లు ఎలా వుందంటే - "ఆ యింటి ఎదుట ఒక పాడుబడ్డ బావి, మరియు ఒక చింతచెట్టు. వర్షపు నీటిలో తడిసి గోడలు ఎత్తు-పల్లాలుగా మారాయి. గోడల్లో నుంచే పిల్లకాలువలు ప్రవహిస్తున్నట్లుగా కన్పిస్తున్నాయి. మేకల రక్షణ భారాన్ని మహావీర హనుమానునిపై నుంచి తను పోలంలో పనికి వెళ్లేవాడు. నైసర్గిక రూప-లావణ్యాంలపై మనసు మారలేదు. తొలకరి వానలు కురియడంతో భూమి తడిసి పోయింది. చెరువులు-గుంటలు చాలావరకు నిండాయి. పత్తి, వరి, జొన్న, సజ్జ, కంది, పెసలు, అలసందలు, దోసకాయలు, మొక్కజొన్న, ఉద్దులు, జనుము, మొదలగు పంటలు వేసేందుకు అత్యాశా పరులైన రైతులు వేగంగా పొలం దున్ను కుంటున్నాడు. వ్యవసాయ తంత్రంలో నిష్ణాతుడైన బిల్లేసురుడు తొలకరితో సాగిన మట్టివాసనల మత్తులో తన మేకలను తోలుకుంటూ వెడుతున్నాడు. గెనుసు నాటాలని మనసులో ఊహించుకుంటూ, యిల్లు చేరుకుని తెలుసుకున్న దేమంటే - మహా వీరహనుమానుని రక్షణలో వదిలి వెళ్లిన మేకలలో ఒక మేకపోతు చచ్చిపడివుంది. అతని కది ఒక భరింపరాని భయంకరమైన అనుభవం. అతనికి జీవన సందేశం మృత్యు సందేశంగా భాసించింది. రైతులు పొలాలు దున్ని యింటికి దారి పట్టారు - ఇంటి కోరల్లో నలిగి చచ్చేందుకు వస్తున్నారన్నట్లు. బిల్లేసురుడు మెల్ల-మెల్లగా మహావీర హనుమానుని విగ్రహం వద్దచేరాడు. ఆ వీరావేశంలో హనుమాన్‌ని ముక్కు మీద బాదాడు-"నేను బీదవాణ్ణి, నిన్ను అందరూ బీదల ఉద్ధారకుడని చెప్పుకుంటారు. నేను నీ వద్దకు ఎందుకు వచ్చే వాణ్ణో, తెలుసా? నీవు నా మేకలను, పిల్లలను కనిపెట్టి వుంటావనే! నీవు వాటికి కాపలా వున్నావా? చెప్పు!" బిల్లేసురుని విగ్రహభంజక వ్యక్తిత్వం యిదే! ఏ విగ్రహం పైని అతని సంపూర్ణ విశ్వాసం యిమిడివుండి వున్నదో, ఆ విగ్రహాన్నే అతడు అసహ్యించుకున్నాడు. విమర్శకాగ్రేసరుడైన డాక్టర్ రామవిలాసశర్మగారు "బిల్లేసుర్ బకరిహ"ను "రామ్‌కి శక్తిపూజా" కవితకు వికల్పంగా పేర్కొన్నారు.

క్రమంగా బిల్లేసురుడు తన జీవితపు చివరి అధ్యాయంలో గట్టి పట్టు సంపాదించాడు. "దుఃఖాలను ఎదుర్కొంటూ వాటి భయంకర స్వరూపాలను సవాలుచేశాడు. ఓటమిని పొంద లేదు ఎక్కడకూడా! అతని ధైర్యసాహసాల ఫలితంగానే కొంత భాగం జీవితాన్ని సాగించాడు. ఆ తర్వాత వివాహంచేసు కోవాలనే ధ్యాసకల్గింది అతనికి. ఎవరైనా పెండ్లి మాట ప్రస్తావిస్తే అతని నరాల్లో విద్యుత్తులు ప్రవహించేవి. తన శ్రేయోభిలాషుల సమక్షంలో అసలు విషయం ప్రస్తావించేవాడు. మోసపోతానేమో ననే భయం అతని మనసులో లేకపోలేదు. అమ్మాయి సౌందర్యా కర్షణతో పాటు మనోవీధిలో అసంఖ్యాక మైన కోరికలు అతన్ని ఉక్కిరి బిక్కిరి చేసివేసేవి. ఈలోగా అతడు తన అన్న మన్నీగారి అత్తతో పరిచయం పెంచుకున్నాడు. ఆమె తనకు పెండ్లి ఏర్పాటు చేస్తుందని ఆశలు పెంచుకున్నాడు. ఉల్లాసంగా దినాలు గడచి పోతున్నాయి. గెనుసు పంట పక్వానికి వచ్చింది. బిల్లేసురుని సంతోషానికి మేరలేదు. కార్తీకమాసపు వెన్నెల కుసుమాలు విరియ బూచినట్లుంది, వెచ్చటి చలి. అన్నిజాతుల పక్షులు ఎక్కడనుండో ఎగిరివచ్చి శీతకాలమంతా చింత మాను చిగుర్లులో ఒక ఏర్పాటు చేసుకుంటున్నాయి. వాటి కలరవము ప్రకృ తిని పులకరింప జేస్తోంది. విపత్కర పరిస్థితుల్లో కూడా బిల్లేసురుని జీవితాశ నశించలేదు. నిరాలా అంటారు, "బిల్లేసురుడు రాత్రుల్లో అరుగు మీద కూర్చుని ఆకాశంవైపు చూస్తూవుండే వాడు. అతనికి సాయంకాలంలో లేడీలు కన్పిం చేవి, యిప్పుడు. అలసి-సొలసి జీవన సంగ్రామంలో ఓడిపోయిన బిల్లేసు రుడు భవిష్యత్తులోకి తొంగి చూడసాగాడు. వ్యవసాయంలో అతనికి అభి రుచి దినదినాభివృద్ధిగాంచింది. గెనుసుపంట పొలంలో అతడు ఒక పర్యాయం బటానీలు పండిస్తే, మరోమారు సెనగ పంటపండించేవాడు. అతని వద్ద బంగారు యిటుక వుందనే పుకారును అతనెప్పుడూ ఖండించలేదు."

నవల చివరి అధ్యాయాలలో నిరాలా గారి హాస్యం చక్కగా సాగింది. పనిపాటల్లో నిమగ్నమైయున్న బిల్లేసురునికి తన అన్నగారి అత్త యిచ్చిన హామీ జ్ఞప్తికి రాగానే అతని మనసు పరిపరివిధాలా ఆలోచనలలో మునిగిపో యేది. "వివాహపుతీగలో మొగ్గలు తొడిగేవి. శ్వాస ఆగిపోయినట్లయ్యేది. రోమాలు నిక్కబొడుచుకునేవి. ఆత్మసమ్మోహనంతో పూజచేస్తూకూడా అద్దంలో తన ప్రతిబింబాన్ని చూచుకునేవాడు - "కళ్లు, కనుబొమలు ముడిచి క్రిందిచూపు చూస్తూ, బుగ్గలు వూది, పెదవులుచూచి మరీ-మరీ తనరూపాన్ని అవలోకిం చేవాడు." యింటి నుండి బయలుదేరే సమయంలో కూడా మంచి శకునాలు

ఎదురైయ్యేవి - నిండుకుండతో ఎదురుగా వస్తున్న మహిళ "లడ్డు ఎప్పుడు పెడతావయ్యా అని అడిగేది!" ప్రకృతి దృశ్యాలు అతనికి కొత్తగా కన్పించేవి. నిరాలా బిల్లేసురుని మానసిక స్థితిని ప్రకృతిలో కూడా కన్పింపజేశాడు. "బిల్లేసురు ముందుకు సాగిపోతున్నాడు. అతడికి ఈత చెట్లు, తాటిచెట్లు కన్పించాయి. కళ్లఎదుట పొలాల పచ్చ దనము ఆకు పచ్చని దుప్పటి పరచినట్లుంది. మంచుతోపాటు సూర్యకిరణాలు భూమిని స్పర్శిస్తున్నాయి. కళ్లలో రకరకాల రంగులు వెల్లివిరస్తున్నాయి. మదిలో చక్కిలిగింత పెట్టినట్లుంది. కాళ్లలో వేగం పుంజుకుంది. మామిడి, విప్పచెట్లను అవలోకిస్తూ ముందుకు సాగుతున్నాడు. శీతకాలం నాటి బంగారు వన్నెతో కూడిన ఎండ - నిరాలా యిలా వర్ణించాడు. "ప్రపంచమంతా స్వర్ణమయంగా వుంది. పేదతనము రంగులు చెదరిపోయాయి. యిప్పుడు బిల్లేసురుని మనసు వాయు తరంగాలలో తేలుతూ పచ్చటి అలల్లో కలసి పోయింది. అతడు పెండ్లి నిశ్చయించుకొని వూరుచేరుకున్నాడు. అతనికి ప్రపంచాన్నే జయించినట్లనిపిస్తోంది. పని - పాటలవాళ్లంతా అతని యింటికి రాసాగారు. మంగలి, కుమ్మరి, బోయలు, మాదిగ, కాపలాదార్లు అందరు - తమ సేవలు అందించేందుకు కదలి వస్తున్నారు. పొరుగు వూరు జమీందారు వూరేగింపుకు తనగుర్రాన్ని పంపిస్తానని కబురు చేశాడు. కానీ బిల్లేసురుడు తన ఆత్మగౌరవాన్ని కాపాడుకునే ప్రయత్నంలో వినయంగా అంటాడుకదా "మేము పేదబ్రావ్మాలం. బ్రాహ్మణుల రీతిలోనే నడుచుకుంటాం." నవల చివరి వాక్యం "నాలుగు రోజుల అనంతరం బిల్లేసురుడు తన భార్యతో యిల్లు చేరుకున్నాడు." "ఆ తర్వాత అతను ధనవంతుడైన రహస్యం తను జీవించి యుండగా మరెప్పుడు బయటకు పొక్కనివ్వలేదు." దీని మర్మమేమిటి అంటే - 'ఆత్మగౌరవం కాపాడుకుంటూనే జీవనయాత్రసాగించాలనే సంకల్పం మాత్రమే!' అతడు సంపన్నుడనే రహస్యం కేవలం రహస్యమే. నిరాలాగారు చూపెట్టిన ఈ నవలాంతం పాఠకీయ దృష్టిలో కొంత ఆధార భూతంగా వున్నా, అందుకు కారణం బిల్లేసురుని జీవనపోరాటం యింకా పూర్తికాకపోవడమే. అంతే కాదు, అతని జీవితంలో యింతకుమించి మరేవిధమైన మార్పు వచ్చే అవకాశం, ఆస్కారం లేక పోవడమే అని చెప్పాలి. అతని జీవనపోరాటంతో ఏన్నోబాధలు, కష్టాలు అతని పట్టుదలను పరిసమాప్తం చేయలేక పోయాయి. ఆకారణంగానే బిల్లేసురుడు అభిజాత్యపు కాల్పనిక హద్దులను చెరపి సామాన్య స్థితిలోనే నవలకు నాయకత్వం పొందగలిగాడు. యితరుల స్థితి-గతులను చూచి నవ్వేవారు చాలా మంది

వుంటారు. కానీ బిల్లేసురుడు తన పరిస్థిత్తుల గురించి తానే నవ్వుకుంటాడు. వయసు పైబడుతున్నకొద్ది వివాహాన్ని గురించిన తన కలతను తలంచుకొని తానే నవ్వుకుంటాడు. బంగారు ఇటుకను గురించి బహుళ ప్రచారం జరిగిన అబద్ధానికి విరగబడి నవ్వుకుంటాడు. నిరాలా గారి వ్యంగ్యప్రధానమైన యధార్థవాదము "బకరిహా"లో పుష్కలంగా మనకు గోచరిస్తుంది. అందులో హాస్య వినోదంతోపాటు ట్రాజన్ రహస్యం కూడా కలగలుపుగా చిత్రింప బడిన కళ మర్మ గర్భంగా కన్పిస్తుంది.

నిరాలాగారు శ్రీ జానకి వల్లభశాస్త్రిగారికి వ్రాసిన ఉత్తరంలో "కుల్లీ భాట్" నవల గురించి యిలా పేర్కొన్నారు - "మంచి-చెడుల మధ్య ఒక రూపాన్ని సంతరించుకొంది." తన రెండో ఉత్తరంలో "చమేలీ" తర్వాత "బిల్లేసురబకరిహా", "రుపాబ్" పత్రికలో ప్రచురింపబడుతుంది. ఈ సంచికలోనే ప్రారంభమవుతోంది. తప్పకచదివేది. ఈ రచన బాగా జరిగిందని నా భావన. 1939 నుండి 1941 వరకు నిరాలాగారు "చమేలీ" మరియు "బిల్లేసుర బకరిహా" రచనలను పూరించడంలో నిమగ్నులైనారు. "చమేలీ" నవల అసంపూర్తిగానే వుండి పోయింది. "బిల్లేసురబకరిహా" అభ్యుదయ నవలా పరిధిలో ఒక గీటురాయిగా నిలచిపోయింది. "బహిరంగ చిత్రణ శైలిలో" "కాలేకారనామే" నవల ఒక కొత్తరూపాన్ని సంతరించు కొంది. యిందులో కూడా ప్రకృతి పరిశీలన, జీవనపోరాటంలో ఎదురయ్యే ఒడు దుడుకులు, ఈతి బాధలు చోటు చేసుకున్నాయి. "కుల్లీభాట్"లో నిరాలా "కుల్లీ" జీవితచరిత్రను రూపొందించాలనుకున్నారు. అందులో ఆయన కూడా ఒక పాత్రగా యిమిడిపోయారు. కానీ "బిల్లేసుర బకరిహా" రచన అలాంటిది కాదు. బిల్లేసురుని జీవితంలోని కొన్ని సంఘటనలను మాత్రం చిత్రించడం జరిగింది. అందులో కధావస్తులోని తీవ్ర జీవనాసక్తి తోపాటు గ్రామీణ నైసర్గిక పరిస్థితులూ, దాని పరిసరాలను మనోజ్ఞంగా చిత్రించడం జరిగింది. ముఖ్యంగా చెప్పాలంటే శుద్ధ హిందీలో జాతీయతను సంతరించుకొన్న ఈ గద్యరూపం ఒక నవలగా వ్యాసము. జీవనచరిత్ర, స్కెచ్, స్మృతి రచనల స్వరూపాలను తనలో యిముడ్చుకో గలిగింది. ఈ నవల హిందీ నవలల ఆదర్శవాదం, సంస్కరణ వాదాలను విశ్వసించక వాటి పట్ల సందేహాత్మక దృష్టిని వ్యక్తంచేస్తోంది. నిరాలా దృష్టిలో ఈ భావనాయుగ పరివర్తన దిశలో ఒక అడ్డుగోడ. ఆయన యిలా అంటారు "రాజకీయ రంగంలో గొప్పపోరాటాల నిమిత్తం తలెత్తాల్సిన అవసరము ఎంతగా ఉందో! అదే విధంగా సాహిత్య క్షేత్రంలో కూడా. అయితే ఈ

పోరాటంలో యిలాంటి దృశ్యాలు మన కింకా కన్పించడంలేదు." ఆకారణం గానే నేడు నవలలకు కీడు స్థితి కల్గింది (సుధా మాసపత్రిక సంపాదకీయం - 1930, ఆగష్టు). నిరాలాగారు స్వయంగా తన నవలలో ఈ మార్పుతెచ్చేం దుకు ఒక దశాబ్దం కాలవ్యవధి తీసుకున్నారు. బిల్లేసురుని సామాన్య జీవిన పోరాటంలో భావన ప్రచ్ఛన్నంగా నైనా స్పష్టంగా కన్పిస్తుంది. హనుమం తుని పట్ల విపరీత మైన భక్తి శ్రద్ధలు గలిగి ఉంటూ కూడా తన విశ్వాసం సడలిపోయిన సందర్భంలో ఆయన మీద దాడి చేసేందుకు వెనుకాడడు. నేడు ఈలాంటి సంఘటనలు అర్థవ్యంజకంగానూ, సాంకేతికంగానూ అధి కంగా కన్పిస్తాయి. "బిల్లేసురబకరిహ" నవల సామాన్య స్వరూపాన్ని ధ్వంసం చేసి ఒక కొత్త నవలా రూపాన్ని అన్వేషిస్తున్న నవల అని చెప్పవలసి వుంటుంది. ఈ నవల అచ్ఛమైన జాతీయత ప్రకృతికి ఆధార భూతంగా నిలువ గల్గింది. ఆకారణంగా ఈ నవల ఒక నవయుగాన్నే సృష్టిందని భావించాలి.

-పరమానంద శ్రీవాస్తవ

# ఒకటి

'బిల్లేసుర్' సరైన పేరు చాలా విచిత్రంగా తెలుసుకో గలిగాను - అసలు పేరు 'బిల్లేశ్వర్.' పూర్వ మండలంలో 'బిల్లేసుర్' అనే పేరే వాడుకలో ఉంది. అందుకు కారణం ఆమండలంలో పై పేరుగల శివుని దేవాలయం వుంది. మరెచ్చట ఈపేరు కన్పించదు. అందుచేత భాషా శాస్త్ర రీత్యా ఈపేరు పరిశోధింప తగ్గది. 'బకరిహ' ఏ ప్రదేశానికి చెందిన శబ్దమో, ఆప్రాంతంలో నిజంగా 'బాకరిహ' అనే పదం ప్రయోగంలోవుంది. నేను ఆశబ్దానికి హిందూస్తాని రూపాన్ని కనిపెట్టాను. 'హ' ప్రయోగము 'వధించు' అనే అర్థంలో కాకుండా 'పోషించు' అనే అర్థంలో అన్వయించుకోవాలి.

బిల్లేసురుడు జాతి రీత్యా 'తరీ' శుక్లవంశానికి చెందిన బ్రాహ్మణుడు. ఖేమే (గుడారం) వానిపుత్రుడు ఖైయ్యామ్‌లాగా ఏదో బకరీవాలా (మేకల మేపువాడు, గొల్లవాడు) పుత్రుడు బకరిహా కాదు. తరీ శుక్ల వంశస్థుడైన బిల్లే సురునికి ప్రపంచాన్ని తరింపజేయు 'తరీ' (నావ) మాత్రం లభింపలేదు. ఆ కారణంగా అతడు మేకలు మేపే వృత్తిని అవలంభించాడు. అందుచేత గ్రామస్థులు అతన్ని 'బిల్లేసుర బకరిహ' అనగా మేకల బిల్లేసురుడని పిలిచేవారు.

హిందీ భాషా - వాఙ్మయాలలో రసాలకు కరవు వుండవచ్చు, కానీవారి జీవితాల్లో రసపుటేరులు గంగా యమునలలాగా ప్రవహిస్తూ ఉంటాయి. ఇర వైయవ శతాబ్ద సాహిత్య స్రవంతులు వారి పాత జీవితాల్లో కోకొల్లలు. అందుకు బిల్లేసురుని కుటుంబాన్నే ఉదాహరణగా తీసుకోవచ్చు. బిల్లేసురుని నలుగురు అన్న దమ్ములు ఆధునిక సాహిత్యపు నాలుగు చరణాలను పూరింపగలరు.

బిల్లేసురుని తండ్రిపేరు ముక్తాప్రసాదు. అతనికి యిలాంటి శుద్ధమైన పేరు ఎలా వచ్చిందో ఎవరికి తెలియదు. అతని తండ్రి పండితుడుకూడా కాదు. ముక్తాప్రసాదుకు నలుగురు కొడుకులు కలిగారు. వారి పేర్లు క్రమంగా - మన్నీ, లలయీ, బిల్లేసుర్, దులారే, ఈ పేర్లు ఆయన నామకరణంచేసిన అసలు పేర్లు. కానీ వారి గుణ గణాలనుబట్టి వాళ్లను సంభోదించే పేర్లువేరు.

'మన్నీ' పుట్టిన ఒక సంవత్సరం తర్వాత ఒకనాడు వాడు తలఎత్తుకొని కూర్చుని తూగడం గమనించి వాని తండ్రి 'గపుఆ' అని పిలవడం ప్రారంభిం చాడు. ఆపేరే ఆదరవాచకంగా 'గప్పూ' అయి మార్చుంది. రెండో అబ్బాయి 'లలయీ' ఎర్రదనం రోమాల్లోకూడా పొడచూపింది. పైగా కాటుక కళ్లు. అతని స్వభావానికి తగ్గట్టు అతని తండ్రి 'భర్రా' అని నామకరణం చేసి ఆద రంగా 'భూరు' అనిపిలిచేవాడు. బిల్లేసురుని గుణానికి తగ్గపేరు. తండ్రి అత నిని 'బిలువా' అని పేరు పెట్టి ముద్దుగా 'బిల్లూ' అనిపిలిచేవాడు. దులారే దేవుని నుండి దయను పొందివచ్చాడు. కానీ అతనికీ నామకరణం చేయ డంలో తండ్రికి ఎలాంటి చిక్కులేకుండా పోయింది. అతన్ని తండ్రి 'కటువా' అని మరి ముద్దుగా 'కట్టూ' అని పిలచేవాడు.

దురదృష్టవశాత్తు పుత్రుల అభివృద్ధిని చూడ కుండానే తండ్రి ముక్తాప్ర సాదు ప్రపంచ బంధనాల నుండి ముక్తి చెందాడు. అతని భార్య పిల్లలను పోషిస్తూ వచ్చింది. ఆమె పిండి విసరి, పాచిపనులుచేసి, పశువులనుమేపి, తోటల్లో కాయ-కసరు ఏరి, పిల్లలకు వ్యవసాయపు పనులు పురమాయించి దేవుని పిలుపు అందుకొని పరలోకానికి వెళ్ళిపోయింది. ఆ తర్వాత ఆ నలుగురు అన్నదమ్ముల మధ్య ఐకమత్యం లోపించింది. వివాదాలు పనిపా టల్లో విఘ్నం కలుగ జేస్తాయి. ఆ కారణంగా నలుగురు అన్నదమ్ములు రెండు గ్రూపులుగా ఏర్పడ్డారు. మన్నీ, బిల్లేసుర్ ఒకవైపు, లలయీ, దులారే మరో గ్రూపు. సనాతన మతస్థులు - ఆర్యసమాజికుల్లాగా కొద్ది రోజులు మాత్రమే వాళ్లు ఐకమత్యంతో ఉండగలిగారు. ఆ తర్వాత వారిమధ్య కూడా - వైష్ణవులు, శాక్తులు, వైదికులు, వితండవాదుల్లాగా శాఖలు ఏర్పడ్డాయి. ఆపైని ఎవరికి వారే - యమునాతీరే ఆయ్యారు.

సనాతన మతానుసారంగా మన్నీ దుఃఖం పాలయ్యాడు. తరీ శుక్లవంశస్థుడైన కారణంగా అతనికి అమ్మాయినిచ్చి పెండ్లిచేసే వారు కరువయ్యారు. కానీ ఇహపరాలకు వివాహం ఎంతైనా అవసరం. తల్లి-దండ్రులు గతించిపోయారు. గృహిణి లేని యింట భూతప్రేతాలు నివసిస్తాయని ఆర్యోక్తి. ఉపద్రవాన్నుండి రక్షించుకోవాలనే సంకల్పంతో మన్నీ పెళ్లి సంప్రదింపులు ప్రారంభించాడు. అంతేకాదు బీదకుటుంబాల పిల్లలకు ఉచ్చులువేయ సాగాడు, ఒకచోట అతని ఉచ్చుబాగా పనిచేయగల్గింది. వివాహ సందర్భాల్లో సాధారణంగా గోరింత కొండంతలు చేసిచెప్పడం పరిపాటి. అంటే అబద్ధాన్ని ఆశ్రయించడం ఆన వాయితి. ఒక రూపాయి ఆస్తిపరుణ్ణి లక్షాధికారిగా అభివర్ణించడం సహజం.

మన్నీ వివాహం కూడా అలాగే జరిగింది.

పసిపాప తల్లి పాలు త్రాగడం మరిపింపబడింది. తల్లి విధవరాలు, ఆమెకు ఆశచూపి నమ్మించగల్గారు. అమ్మాయికి రెండు - మూడు వందల కంటే ఎక్కువ యిచ్చే వాళ్లెవరు లేరు. నీవేమో యింకా ఈ పాపను కనీసం పది సంవత్సరాలైనా పోషించాల్సి వుంటుంది, ఈ బాధంతా నీకెందుకు? నీవు కూడా అల్లుని యింటవుంటూ రాణీ లాగా బ్రతుకు. పాలు, పెరుగు, వెన్న, నెయ్యి సమృద్ధిగావున్నాయి. అమ్మాయిని పెంచుకుంటూ అల్లుని యింటే వుండిపో - నల్గురు పెద్దలు ఆమెకు తెలియ జెప్పారు. ఆ మాటలు ఆమె చెవిని బాగా నాటాయి. మన్నీ వయస్సు అప్పుడు ముప్పది సంవత్స రాలు. పొట్టివాడుగా ఉన్నాడు కాబట్టి పందొమ్మిది, ఇరవై సంవత్సరాల యువ కుడుగా కన్పిస్తాడు. అతని వయసు అంతకంటే ఎక్కువేమి లేదని చెప్పారు. పైగా అతనికి మీసాలు కూడా అట్టేలేవు, కార్య సాఫల్యం జరిగింది.

మన్నీ పొలాల దగ్గరగా ఒక పొదరిల్లు వుంది. అక్కడ ఝూడ్ ఖండేశ్వ రుడు నివసిస్తున్నాడని ప్రతీతి. ఒకరోజు సాయంకాలం మన్నీ ధూపము, దీపము, అక్షంతలు, చందనం, కర్పూరం, పూలు, పండ్లు, జలంతో అక్కడ చేరాడు. మోకాళ్లపైన కూర్చుని ఆదేవతను పూజిస్తూ ఏదో జపం చేశాడు. ఆ తర్వాత ప్రసాదం తీసుకొని యింటికి తిరిగివచ్చాడు. ఆ రోజు తెల్లవారు జామున తూర్పుదిశకు బయలుదేరాడు. ఒక వారం రోజుల తర్వాత ఊదా రంగు రుమాల ధరించి ఒక విధవరాలు ఆమె బిడ్డతో సహాఇల్లు చేరుకున్నాడు. దారిలో జమీందారు కల్లంలోని ధాన్యపురాశిని చూపించి యీ పంటంతా మనదే అని కోతలుకోశాడు. అత్తగారి ఆనందానికి హద్దులులేకపోయాయి. మరికొంత దూరంలో పండ్ల తోటలు -వనాలు కన్పించాయి. మన్నీ చూపుడు వేలుతో అటువైపు చూపుతూ - ఈ దిశ నుండి ఆ దిశ వరకు కనిపించే తోట లన్నీ మనవేనన్నాడు. అత్తగారికి అల్లుడు ధనవంతుడనే విషయంలో ఏ మాత్రం సందేహం కలగ లేదు. ఇల్లు పాడుబడివుంది. అయినా అతని వాగ్ధోరి అపూర్వంగా పనిచేయ గలిగింది. అతడు వాళ్ల అన్న దమ్ములతో వేరు పడి ఒక భగ్నగృహంలో ఉంటున్నాడు. ఆ ఇల్లు చేరక పూర్వమే దారిలో జమీందా రుగారి మహలును చూపి - "అత్తయ్యా, వాస్తవానికి ఈ మహలు మనదే అయితే అందులో ప్రస్తుతం మా అన్నదమ్ములు ఉంటున్నారు. నిన్ను ఒక ఏకాంత ప్రదేశానికి తీసుకవెళ్తాను. అక్కడ నీవు హాయిగా ఉండవచ్చు. ఈ మహల్‌లో మీకు తగిన మర్యాదలు జరుగవు. కొద్ది రోజుల్లో మన ఆ భిన్న

గృహాన్నే మహలు చేసుకుందాం" నమ్మించాడు. మన్నీ అత్తయ్యా ఆదరభావంతో యిలా అంది - "అవును నాయన! నీవుచెప్పేది నిజమే! పరాయి వాళ్లతో కలసి-మెలసి వుండడం కష్టమేకదా!" ఆ తర్వాత మన్నీ వాళ్లను భగ్న గృహానికి తీసుకెళ్లాడు. ఆ వెంటనే వెళ్లి ఐదుశేర్లు పాలు తెచ్చాడు. అత్తయ్యా సిగ్గుపడుతూ "యిన్ని పాలు ఎవరు తాగుతారు! నాయన?" అంది. మన్నీ గంభీరంగా ముఖం పెట్టి - "అత్తయ్యా! ఈ పాలుకాస్తే కొద్దిగానే వుంటాయి గదా! అయినా మనం ముగ్గురమున్నాము. ఇవేమంత ఎక్కువ గాదు. మళ్లీ కాసేపుండి కావాలనుకుంటే పాలల్లో చక్కెర కలుపుకొని షర్బత్ లాగా త్రాగవచ్చులే!" అన్నాడు. అత్తయ్యా అల్లుని మాటలకు పొంగిపోయింది. మన్నీకి భంగ్‌పీల్చే అలవాటు బాగావుంది. ఠాకుర్‌గారి దేవిడిలో భంగ్ నూరుకొని గుట్టు చప్పుడు లేకుండా పట్టుకొచ్చాడు. పాలల్లో చక్కెరతోపాటు భంగ్ ఉండను కూడా బాగా కలపి బాదాము గింజలు నూరి చక్కగా షర్బత్ లాగా తయారు చేసి అత్తగారి చేత తాగించాడు. అత్తగారికి ఆ పానీయం అమృతప్రాయంగా తోచింది. ఆమె ఒకే గ్రుక్కలో గ్లాసుఖాళీ చేసింది. ఆ తర్వాత మన్నీ కొద్దిగా తన కాబోయే భార్యకు తాపి తాను మిగిలినదంతా తాగేశాడు. అత్తగారు కాళ్లు-చేతులు కడుక్కొని అన్నానికి కూర్చుంది. మన్నీ పూరీల పొట్లాలు విప్పాడు. అత్తగారికి కైపు వచ్చేలోగా మన్నీ ఆమెకు పూరీలు కూరలు, మిఠాయిలు, పకోడీలు, ఊరగాయ అన్నీ వడ్డించాడు. అత్తగారు తన పూర్వజన్మ సుకృత ఫలితంగా ఈ లాంటి అల్లుడు దొరికాడని తన అదృష్టాన్ని ఎంతగానో మెచ్చుకుంది. కంఠం వరకు తిని తేపింది. మన్నీ మంచం వేసి దుప్పటీ పరిచాడు. తల్లి-పిల్ల మెల్లగా నిద్రలోకి జారుకున్నారు. మన్నీ అన్నం తిని దేవుని ఒకసారి మనసారా స్మరించు కున్నాడు. అర్ధరాత్రి సమయంలో అత్తగారిని పిలిచాడు. బాగా కేకవేశాడు. గట్టిగా తలుపుబాదాడు, అయినా ఆమె కళ్లు తెరువలేదు, తెల్లవారి నంతవరకు ఆమెకు నిద్రమత్తు వదలదని బాగా నిర్ధారణ చేసుకున్నాడు. అంతే తన కాబోయే భార్యను భుజాన వేసుకొని బుద్ధ భగవానునిలాగా గృహత్యాగంచేసి బయలుదేరాడు. పసిపిల్ల భుజం మీద హాయిగా నిద్రపోతోంది. మన్నీ తెల్లవారేలోగా ఏడుకోసులు ప్రయాణంచేసి తన బంధువుల ఇల్లుచేరుకున్నాడు. వాళ్లు మన్నీకి ఏలాంటి ఆపదరాకుండా జాగ్రత్త పడ్డారు.

అత్తగారు తెల్లవారి లేవగానే గోలమొదలెట్టింది. అసలు విషయం తెలుసుకుంది. కానీ ఏం లాభం! ఆపాటికే పక్షి గూటిలో నుండి ఎగిరి పోయింది.

ఆమె రోదిస్తూ శాపనార్థాలు మొదలెట్టింది - నీవు చచ్చి సున్నంకాను! భ్రష్టు ముండా కొడక! నీ పాడెకట్టనా! ఆఖరికి విసిగివేసారి మెల్లగా తన ఇల్లు చేరుకుంది.

మన్నీ మంచి ముహూర్తం చూచుకొని ఆ పిల్లతో గుట్టు చప్పుడు లేకుండా వివాహంచేసుకొని భార్యాసమేతంగా పరదేశానికి ప్రయాణంకట్టాడు. అక్కడ పది పంద్రెండు సంవత్సరాలు ఆపిల్లకు సేవచేశాడు. ఆమెకి ఇరువది సంవత్సరాల వయస్సులో ఒక పిల్లతల్లిగా చేసి స్వర్గానికి చేరుకున్నాడు. మన్నీ సనాతనమతావలంబి.

లలయీ పరిస్థితి చెప్పాల్సివుందిగదా! అతడు కలకత్తా బొంబాయి నగరాల్లో కూలి-నాలి పనులుచేసి చివరకు రత్‌లామ్‌లో స్థిరపడ్డాడు. అక్కడ ఒక గుజరాతి బ్రాహ్మడితో అతనికి నేస్తం ఏర్పడింది. దైవేచ్ఛఅని చెప్పాల్సి ఉంటుందేమో! అతనితో మైత్రి కల్గిన కొద్ది రోజులకే అతడు తనువు చాలించాడు. విధిలేక లలయీకి ఆయింటి బరువు-బాధ్యతలు వహించాల్సి వచ్చింది. ఆ మిత్రుని కుటుంబంలో అతని భార్య, ఇద్దరు కుమారులు, పెద్దకుమారుని భార్యవున్నారు. ఆ కుటుంబంతో అతని సంబంధం అతని మిత్రుని సంబంధంలాగే ఏర్పడింది. అంతే గాదు ఆ కుటుంబానికి కొద్దిగా ఆస్తి-పాస్తులు కూడా ఉన్నాయి. ఆ కారణంగా లలయీ పరదేశంలో నివసించే దానికన్నా స్వగ్రామంలో నివసించడం మంచిదని భావించాడు. అతడి విశ్వాసాలు, కార్యకలాపాలు ధృడమైనవి కాబట్టి అతడు లోకనిందలు, కీర్తి ప్రతిష్ఠలు, పొగడ్తలను సమానంగా భావించేవాడు. ఆవిధంగా వారందరిని తన గ్రామానికి తీసుకవచ్చాడు. లలయీకి ఒకే దెబ్బతో భార్య, యిద్దరు పుత్రులు, కోడలు లభించడం చూచి గ్రామస్థులంతా విస్తుపోయారు. ఈలాంటి చమత్కారాన్ని వాళ్లెప్పుడు చూచిన వాళ్లుకాదు. పైగా వినలేదేమోకూడ!

గ్రామస్థుల స్వభావాన్ని అతడు బాగా ఆకలింపు చేసుకున్న వాడు కాబట్టి వాళ్ల ద్వారా ఎదురయ్యే కష్ట నష్టాలకు చక్కగా బేరీజు చేసుకునే ఆగ్రామంలో అడుగు పెట్టాడు. గ్రామస్థులు అతన్ని కులబహిష్కరణ చేశారు. లలయీ ఖర్చు బెడద తప్పిందిలే అనుకున్నాడు. వాళ్లు అలాగా అతన్ని కులాన్నించి బహిష్కరించకపోతే అతడు గ్రామానికంతా విందు చేయాల్చి వచ్చేది. గ్రామస్థులంతా కూడా లలయీ వాళ్లను లెక్కచేయకుండా మూర్ఖుల్ని చేశాడని విచారించారు. పైగా ఆస్తిపాస్తులు ఆర్జించుకొనివచ్చాడు. ఏలాంటి శ్రమలేకుండా! అది వాళ్లందరికి కన్నెర్ర చేసింది. కానీ, లలయీ నిర్వికార

భావంతో తనపనులేవో తాను చేసుకపోయేవాడు. ఈలోగా దేశంలో రాజకీయ ఉద్యమం ప్రారంభమైంది. లలయీ ఆ ఉద్యమంలో అడుగు పెట్టాడు. పెద్ద కుమారుడు గుజరాత్‌లో ఏదో మంచి ఉద్యోగంలో చేరాడు. ఖర్చులకు బాగా డబ్బు పంపేవాడు. గ్రామస్థులు అతని ప్రభావానికి లోనైపోయారు. లలయీ ధైర్యం వల్ల గ్రామస్థుల ఆటలేమీ సాగలేదు అతనిముందు. వాళ్ల సహాయనిరాకణ అతడి సాహసానికి వీగిపోయింది. అందుచేత వాళ్లంతా అతన్ని మంచిచేసుకునే ప్రయత్నం సాగించారు. లలయీ సాంఘిక సంస్కర్త, రాజకీయ కార్యకర్తగా మంచిపేరు సంపాదించాడు.

బిల్లేసురుని కథ తర్వాత అధ్యాయంలో వివరిస్తాము. అతనిలో బలము-ఈశ్వరుడు-రెండు సమానంగా ప్రోదిచేసుకున్నాయి.

దులారే ఆర్యసమాజికుడు. ఆ గ్రామనివాసి బస్తీదీన్ సుకున్ తన ఏభైయ్యవ యేట ఒక విధవరాలును లేపుకొచ్చాడు. కానీ ఒక సంవత్సరం తిరుగకముందే అతడు గతించిపోయాడు. దులారే ఆ విధవకు బాగా నూరిపోశాడు. భర్త జీవించి వుండగానే మూడు సంవత్సరాల మూడు మాసాలు భార్యతో ఏవిధమైన సంపర్కం కలిగి ఉండకపోయినట్లయితే ఆమెకు తన రెండో భర్తను ఎన్నుకునే అధికారం సంక్రమిస్తుందట. అలాంటి స్థితిలో బస్తీదీన్ గతించిపోయాడు కాబట్టి ఆమెకు తనమూడో భర్తను ఎన్నుకునే అధికారం సంపూర్తిగావుంది. పైగా దులారే ఆమెకు అన్ని విధాల సేవలు చేసేందుకు సిద్ధంగా వున్నాడు. ఆడదానికి ఒక ఆశ్రయం - అవలంబన కావాలిగదా! ఆమె మారు మాట్లాడకుండా దులారే అభ్యర్థనను ఒప్పేసుకుంది. పాపం, దురదృష్టవశాత్తు దులారే కూడా ఒక సంవత్సరం తిరుగకుండానే ప్రపంచానికి దూరమయ్యాడు, అప్పుడు ఆమె గర్భవతి. కొంతకాలానికి ఆమెకు ఒక కొడుకు పుట్టాడు. ఇప్పుడు అ అబ్బాయి నారదుడిలాగా లలయీ వాకిట కూర్చుని ఆడుకుంటున్నాడు. తల్లికూడా ఆశిశువుకు దూరమైంది.

# రెండు

మన్నీ దారి చూపించి వెళ్లాడు. బిల్లేసురుడు ఆదారివెంటే వెనుకగా నడిచాడు. బిల్లేసురుడు వాళ్ల గ్రామంలో ఒక సామెత విన్నాడు - బెంగాలులో డబ్బు కూడుతుంది. బొంబాయిలో డబ్బు నిలవదు అని. ఇంకేమిటి? బెంగాలు దారి పట్టాడు. ప్రక్కగ్రామంలోని కొంత మంది యువకులు బర్ద్వాన్ మహారాజా

గారి ఆస్థానంలో సిపాహీలుగానూ, దర్బానులుగాను. జమేదార్లుగా పని చేస్తున్నారు. బిల్లేసురుడు కూడా బర్ద్వాన్‌వెళ్లటానికి నిశ్చయించుకున్నాడు. కాని చేతిలో ఖర్చుకు కానీలేదు. అయినా ప్రగతిపథంలో పయనించే వాడిని ఎవరు ఆప గలుగుతారు? ఆనాడు బోల్సేవిజాన్ని గురించి ఏ కొద్దిమందో వినివుంటారు. బిల్లేసురునికి నేటికి కూడా తెలియదనుకోండి. అయినాకూడా ఏదో ఐడియా అతని మెదడులో తళుక్కున మెరిసింది. అతను కట్టుబట్టలతో అలాగే కాన్పూరు చేరుకొని టిక్కెట్ లేకుండా కలకత్తా వెళ్లే బండిలో కూర్చున్నాడు. అలహా బాదు చేరగానే టికెట్ కలక్టర్ అతని చెవిపట్టుకొని బండిలో నుండి దింపివే శాడు. బిల్లేసురుడు ఆనాటి పరిస్థితుల కనుగుణంగా సవినయంగా చట్ట వ్యతి రేకతను ప్రదర్శిస్తూ ఉన్నాడు. మరేమీ మాట్లాడకుండా బండిలో నుండి క్రిందకుదిగాడు, కానీ తనసిద్ధాంతాన్ని మాత్రం త్యజించలేదు. ప్లాట్‌ఫారం మీద పచార్లుచేస్తూ వచ్చే వెళ్లే బండ్ల వివరాలను తెలుసుకుంటూనే వున్నాడు. తూర్పుదిశకువెళ్లే మరోబండి రాగానే అందులో ఎక్కేశాడు. మొగల్‌సరాయి వద్ద మళ్ళీ దింపబడ్డాడు. అలాగే బండిలో ఎక్కుతూ, దిగుతూ రెండు-మూడు రోజులకు బర్ద్వాన్ చేరు కున్నాడు.

పండిత సత్తీదీన్ సుకుల్ బర్ద్వాన్ మహారాజా గారివద్ద జమేదారు. బెంగాలీలకు 'సత్తీదీన్' శబ్దం అంతగా రుచించి నట్లులేదు. ఆ కారణంగా 'సత్యదీన్' 'సతీదీన్' అని పలుకరించేవారు. అయినా కూడా అతని అభి వృద్ధిని ఆపలేకపోయారు. తన అంతులేని మూర్ఖత్వం వల్లనే సత్తీదీన్ మహా రాజాగారి సగం ఖజాంచీ కాగల్గాడు. సగం ఖజాంచీ ఎందుకంటున్నామంటే ఖజానాతాళపు చెవులు మాత్రం అతని వద్ద ఉండేవి, కానీ ఖాతా మరొక గుమాస్తా వ్రాసేవాడు. ఆ కారణంగా సత్తీదీన్ తనను తాను ఏకమాత్ర విశ్వా సపాత్రుడుగా భావించుకునే వాడు. ఇతర హిందూస్థానీయుల పైన కూడా గట్టిగా ఆ ప్రభావం పొడచూపింది. బిల్లేసురుడు బాగా ఆలోచించుకొని అతన్ని ఆశ్రయించాడు. సత్తీదీన్ కుటుంబంసమేతంగా నివసించేవాడు. రెండు-మూడు ఆవులను కూడా పెంచుకుంటున్నాడు. అతని భార్య, 'శిఖరిదశన' అనగా ఆమెకు ముందుభాగం రెండు పళ్లు అవసరానికి మించి పెద్దగా వున్నాయి. పెదవులతో ఎంత ప్రయత్నించినా అవి మూసుకపోయేవి కావు. వంశరీత్యా సత్తీదీన్ కనౌజియా బ్రాహ్మణుడు. అంటే ఒక మెట్టు ఎక్కువేనన్నమాట, పై కారణాలుగా బిల్లేసురునికి అక్కడ కొంతరక్షణ కన్పించింది.

బిల్లేసురుడు సత్తీదీన్ యింటిలో స్థానం సంపాదించుకున్నాడు. బీద

వాడి వినయ-విధేయతలు ప్రదర్శిస్తూ మెల్లగా, నడుమువంచి, క్రింది చూపులతో సంచరించేవాడు. మంచి వయస్సులోవున్న సత్తీదీన్ భార్యకు కాలక్షేపం చేయగలవాడొకడు లభించాడు. రెండు-మూడు రోజులు బిల్లేసురునికి అక్కడి భోజనం రుచించలేదు. ఒకరోజు అతడు ఆమె గదివైపుగావెళ్లాడు, ఆమె చమత్కారంగా చాలాకీగా అన్నది. "బిల్లేసుర్, నీవు ఏలాగువచ్చేశావు. ఈ పశువుల కాపరిని పంపేస్తాను, వీడు దండుగమారి. తిండి తిని వృధాగా జీతం తీసుకుంటున్నాడు. అసలు వీడికి ఏదైనా పని అంటూ వుంటే గదా! గడ్డి విస్తారంగా పెరిగివుంది. రెండు మోపులు కోసుక రావాలి. పశువులకు కుడితి-నీళ్లువేళకు పెట్టాల్సి వుంటుంది. పల్లెల్లోలాగా లాఠీకర్రపుచ్చుకొని పశువులవెనుక తిరుగాల్సిన పనీ లేదు. మూడే మూడు ఆవులు, గడ్డి ఏపుగా పెరిగి వుంది. అవులను తోలుకెళ్లి కర్రపాతి పొడుగు త్రాళ్లతో కట్టివేయాలి. అంతే, సాయంకాలం వరకు ఆవులు మేస్తూవుంటాయి. సాయంకాలము బాబులాగా పచార్లు చేస్తూ వెళ్లి ఇంటికి తోలుక రావాలి. పాలుపితికి దోమల బెడద వదిలించుకునేందుకు పచ్చిగడ్డి పొగ బెట్టాలి" అంటూ పళ్లు కనబడ కుండా పెదవులు మూసేందుకు ప్రయత్నించింది.

బిల్లేసురుడు జాగ్రత్త పడ్డాడు. పశువులమేపేందుకు సముద్రం దాటి వెళ్లాల్సిన పనిలేదుగదా! గ్రామ సరిహద్దుల్లోనే మేపాలి. ఈ పరదేశంలో తనవాళ్లంటూ ఎవరూ లేరు, ఒకరిని ఆశ్రయించి బ్రతకాలి. ఏదో చిన్న ఉద్యోగం దొరికినంత వరకు ఈ పనులు చేద్దాం. లేదా యింటి దారివుండనేవుంది.

బిల్లేసురుడు ఈ ఆలోచనల్లో మునిగి వెంటనే జవాబివ్వలేదు. అది గమనించి సత్తీదీన్ భార్య అతడి వైపు ప్రశ్నార్థకంగా చూచింది. బిల్లేసురుడు ధృడ చిత్తంతో యిలా అన్నాడు - "యివేమంత పెద్ద పనులు కావు. నేను పనిచేయటానికీ సిద్ధపడి వచ్చాను - ఏడు వందల కోసులు ప్రయాణంచేసి - మా గ్రామం ఏడు వందలకోసులు ఉంటుంది, కదూ?"

బిల్లేసురుని నిర్ణయాన్ని సమర్థిస్తూ సత్తీదీన్ భార్య అన్నది - "కాన్పూరు - బర్ద్వాన్ మధ్య దూరం యింకా ఎక్కువే వుంటుంది." మళ్లీ సాలోచనగా యిలా అన్నది, "జమేదార్ సాహెబ్ రాగానే ఆయన్ని అడిగిచెపుతాలే! ఆయన పుస్తకంలో అన్నీరాసి వున్నాయి."

బిల్లేసురుడు మౌనంగా తన అదృష్ట-దురదృష్టాలను బేరీజు చేసుకోసాగాడు.

సాయంత్రం జమేదార్ ఇంటికి చేరుకున్నాడు. భోజనం తయారుగా వుంది. జమేదార్ భార్య తన భర్తకు కాళ్లు-చేతులు కడుక్కునేందుకు నీళ్లు

యిచ్చింది. జమేదారు పీట మీద కూర్చున్నాడు. ఆమె ఎదురుగా కూర్చుంది. జమేదారు అన్నం తినడం ఆరంభించాడు. ఆమె మెల్లగా అన్నది - "జమేదార్, బిల్లేసుర్ అంటున్నాడు గదా - మనదేశం యిక్కడికి ఏడువందల కోసులు వుంటుందని - నేనంటున్నా యింకా పైగానే వుందని. నీ పుస్తకంలో ఈ వివరాలన్నీ రాసి వున్నాయిగదా?"

సత్తీదీన్‌కు జమీందారీ తరపున ఒక డైరీ యిచ్చారు. ఆడైరీ కూడా క్లర్క్ వ్రాశేవాడు. అందులో ఏం రాసి ఉందో సత్తీదీన్ క్లర్క్‌ని అడిగి చదివించుకొని అప్పుడప్పుడు తెలుసుకునేవాడు. సత్తీదీన్ అనుకునేవాడు - మహారాజా గారు అతనికి పెద్ద పదవి యిచ్చారు. ప్రపంచాన్నంతా బేరీపండులాగా అతని చేతిలో పడేశారు. అనేక పర్యాయాలు అతడాడైరీని యింటికి పట్టుకొచ్చాడు కూడా. అక్కడ విన్నది, జ్ఞాపకం వున్నవిషయాలు మౌకిక రూపంలో భార్యకు చెప్పేవాడు.

ఎడమచేతితో మీసాలు మెలిమేస్తూ నోటిలో ముద్దను మ్రింగి సత్తీదీన్ అన్నాడు "ఏడు వందల కోసులు అలహాబాదువరకే దూరం వుంది." జమేదార్ భార్యకళ్లు మిటకరిస్తూ బిల్లేసురుని కళ్లలోకిచూచింది. బిల్లేసురుడు తన పరాజయాన్ని స్వీకరిస్తూ - "పుస్తకంలో రాసి వుంటే అది నిజమే అయి వుంటు" దన్నాడు.

పూర్వకాలంలో ఏవైనా పనులు సాధించు కోవాలనుకుంటే గొప్పవాళ్ల స్వభావాన్ని తెలుసుకొని నెమ్మదిగా తమ కోర్కెలు విన్నవించుకునేవారు. ఆలాగే జమేదారు ప్రసన్నచిత్తుడుగా వుండడం గమనించి భార్య తన అర్జీని తెలిపింది. బిల్లేసురుడు అతని జవాబు ఏం వస్తుందోనని ఆరాటపడ్డాడు. సత్తీదీన్ ఆమె అర్జీలో కొంత మార్పుచేస్తూ మధ్యమార్గంగా ఒక ఉపాయం కనిపెట్టి యిలా అన్నాడు. "బిల్లేసురుడు మన వాడే. అందులో ఏ మాత్రం సందేహంలేదు. వీడు మొదట పనివాడికంటే కాస్త ఎక్కువే తింటాడు. ఇందులో కూడా ఏమాత్రం సందేహంలేదు. కానీ మనం వీడికి నెల జీతం అంటూ ఏమీ ఇవ్వం. రెండు పూటలా తిండిపెడ్తాం. జీత - భత్యాల పేరుతో కచ్చేరిలో వుండే జమేదారుతో చెప్పి కచ్చేరి జాబులు గుమాస్తాల పేరుతో యిప్పించే ఏర్పాటు చేస్తాను. అది రోజుకు నాలుగైదు గంటలకంటే పని ఎక్కువేమీ ఉండదు. నెలకు ఈ విధంగా నాలుగైదు రూపాయలు వీడికి చేతికందుతూ వుంటాయి. మన ఇంటి పనులుకూడా చేస్తూ వుంటాడు. సరేనా?"

సత్తీదీన్ భార్య తన ఉపకారబుద్ధిని ప్రదర్శిస్తూ బిల్లేసురుని మీద దృష్టి

ప్రసారించింది. బిల్లేసురుడు తిండి, తిప్పలుతోపాటు 4-5 రూపాయల జీతం మాట విని భవిష్యత్తులో యింకా పైకి వెళ్లే అవకాశం ఉంటుంది గదా అని ఆలోచించసాగాడు. ఈ అవకాశానికి తన సంతృప్తి తెలుపుతూ కళ్లతోనే తన నిర్ణయాన్ని తెలియజేశాడు.

జమీదార్ గంభీరంగా చేతులు కడుక్కునేందుకు లేచాడు.

# మూడు

బిల్లేసురుడు జీవన సంగ్రామంలో ప్రవేశించాడు. ఆవుల గురించిన ఎన్నో విషయాలు మొదట అతనికి చెప్పారు కాదు. అవన్నీ యిపుడతడు చేయాల్సి వస్తోంది. పేడ తీయడం, పశువుల దొడ్డిశుభ్రం చెయ్యడం, పిడకలు చేయడం, అప్పుడప్పుడు ఆవులకు స్నానం చేయించడం, యిలాంటి వెన్నో పనులు. ఆ కారణంగా బిల్లేసురునికి విశ్రాంతి లభించేదికాదు. జాబులు అంవజేయడానికి కూడా అవకాశం కల్గేదికాదు. దగ్గర ప్రదేశాలకు చేరవేసే జాబులు అతనికి అందజేసేవారు. సత్తీదీన్ లెఖ్ఖ ప్రకారం ఒక ఉత్తరానికి మూడణాలు లభించేవి. కొద్దిరోజుల తర్వాత అతనికి అర్థమయిందేమిటంటే దూర ప్రదేశాలకు జాబులు చేరవేస్తే ఆరణాలు యిస్తారని. తహసీల్ జమేదార్‌తో దూరప్రదేశాలకు పంపే జాబులివ్వమని విన్నవించుకున్నాడు. అతడు విరుచుక పడ్డాడు. "నీవేమీ మహారాజాగారి నౌకరువుకాదు. మరో నౌకరు స్థానంలో పని చేసేందుకు వచ్చినవాడవు కాదు. పైగా సత్తీదీన్ నీకు దూరప్రదేశాలకు వెళ్లి జాబులు యివ్వవద్దని చెప్పారు. కాని నీకు ఆబాధ్యత యివ్వలేను మరోలా అనుకోకు." బిల్లేసురుడు అతనికాళ్లా - వేళ్లాపడ్డాడు - "బాబుగారు! నౌకరీ ఇచ్చేది తమరే గదా! నాకు కొద్ది రోజులు దూరప్రదేశాలకు వెళ్లే తపాలా ఇస్తూ వుండండి. నేను 12 కోషులు ఆరుగంటల్లో వెళ్లి వస్తా." బిల్లేసుర్ని మీద దయకలిగి కచ్చేరి జమేదారు అతనికి దూరప్రదేశాల జాబులు యివ్వడం ప్రారంభించాడు.

బిల్లేసురుడు తపాలాపని చేయడం సత్తీదీన్ భార్యకు ఏమాత్రం సహించేదికాదు. బిల్లేసురుని చూస్తే ఆమె ముఖం మాడ్చుకునేది. అతని పనులు చక్కగా చేసుకపోయేవాడు. పదిగంటలలోపుగా అన్నిపనులు సవరించి తపాలాపనిమీదవెళ్లేవాడు. తిరిగి వచ్చేటపుడు ఆవులనుతోలుకొని యింటికి చేరే

వాడు. రాత్రి 9 గం||ల వరకు ఇంటి పనుల్లోనే మునిగి వుండేవాడు. అయినా కూడా సత్తీదీన్ భార్య ముఖంలో చెక్కిళ్లు ముడిపడివుండేవి. బిల్లేసురుడు చౌకగా దొరికాడుగదా అని మరో నౌకరును కూడా వాళ్లు కుదుర్చుకున్నారు కాదు. అప్పుడప్పుడు ఆమె సూటి-పోటు మాటలు కురిపించేది. అయినా కూడా బిల్లేసురుడు సహించుకునేవాడు. వేసవికాలంలో 10-12 గం||ల వరకు బిల్లేసురుడు యింటి పనులు చేసేవాడు. జాబులు చేరవేసేందుకు ఆలస్యం అవుతుందని మండుటెండలో, కాళ్లలోచెప్పులు, తలమీద గొడుగులాంటివి ఏమీలేకుండా పరుగెత్తి జాబులందజేసి వగర్చుతూ ఇల్లు చేరుకునేవాడు. నాలుక ఆరిపోయి, చెమటలుకారుతూ, గుండె వేగంగా కొట్టుకొంటూ వుంటే మళ్లీ అతడు యింటిపనుల్లో జొరబడేవాడు. అలసటతో ఎప్పుడైనా రెండు నిముషాలు విశ్రాంతి తీసుకుందామని కూర్చున్నాడంటే సత్తీదీన్ భార్యకత్తి లాంటి పదునైన పదజాలంతో ప్రశ్నించేది - "బిల్లేసుర ఏమాత్రం సంపాదించావ్" అని. బిల్లేసురుడు ఆ వేడిమిలో కూడా శాంతించి నెమ్మదిగా పళ్లు ఇకిసిస్తూ జవాబిచ్చేవాడు. కొద్ది నిముషాలు విశ్రాంతి తీసుకొని మళ్లీ తనపనుల్లోకి వెళ్లేవాడు.

ఆ రోజుల్లో బిల్లేసురుడు అనేకపర్యాయాలు ఎంతో మంది బాధగా - "మగవాడి లాగా పుట్టేకంటే ఆడదిగా పుట్టడమే మంచిదేమో" అని చెప్పడం జరిగింది. కాని అతడి మనస్సులోని బాధను ఎవరూ అర్థం చేసుకున్నారు కాదు. బిల్లేసురుడు పొడి నవ్వు నవ్వి మౌనంగా వుండి పోయాడు.

గ్రామంలోకూడా అతడు ఎన్నోఅవమానాలను సహించుకుంటూ కాలం గడిపేవాడు. మౌనంగా తన జీవితమనే పుస్తకాన్ని చదువుతూ వుండేవాడు. అతడు ఒక విజ్ఞానికంటే గొప్ప నాస్తికుడులాగా ఎదిగాడు.

బిల్లేసురుడు ఇతరులపైన అపనమ్మకాలు కల్గించుకుంటూ ఒక విధమైన వ్యక్తిలాగా తయారయ్యాడు. కానీ తన విశ్వాసాలను మార్చుకున్నవాడు కాదు - ఒంటరి ఈతగాడిలాగా! సత్తీదీన్ భార్యకు దూరప్రదేశాలకు కూడా జాబులు చేర వేస్తున్నసమాచారం తెలియకుండా జాగ్రత్త పడ్డాడు. 12కోసుల దూరాన్ని ఆరుకోసుల దూరమని చెప్పేడు. ప్రపంచాన్ని సంతోషపెట్టే చిట్కాలు నేర్చుకున్నాడు. ఎన్నో మాసాలు ఈ బాధ్యత నెరవేర్చాడు. చివరకు ఒకరోజు కచేరి జమేదారు ప్రసన్న వదనం గాంచి మెల్లగా విన్నవించుకున్నాడు "బాబుగారూ! నాకూ ఏదైనా ఉద్యోగం యిప్పించరూ?" "ఆలాగే! రేపు వచ్చి నీ కొలతలివ్వు" జమేదార్ జవాబిచ్చాడు.

బిల్లేసురుడు, మన్నీ సోదరుడు. అతను ఐదు అడుగులకన్న కొద్దిగా ఎత్తున్నాడు, ఎత్తు తక్కువ కావచ్చునని అతనికి తెలుసు. కాన ఒక ఉపాయం ఆలోచించాడు. ఒకటిన్నర యించి ఎత్తైన చర్మము బూట్లు కుట్టించు కున్నాడు. మధ్యలో దూది నింపించాడు, ఆ బూట్లుతొడుగు కొని నిలబడ్డాడుగదా అతను ఇటుకలపైన నిలబడినట్లుగా కన్పించాడు. కానీ అతను ఏమాత్రం తొణుకు-బెణుకు, భయం లేకుండా తనకొలతలిచ్చాడు. కచ్చేరీలో ఒక కర్రతో కొలిచారు. బిల్లేసురుడు తలపైకెత్తి చూసాడు. కొలత సరిపోయిందిగదా అను కున్నాడు. కానీ కొలత తీసుకున్న అతను చల్లగా నీవు ఒకటిన్నరయించ్ ఎత్తు తక్కువన్నాడు.

బిల్లేసురుడు జమేదారు కళ్లలో దీనంగా చూశాడు. విన్నవించుకున్నాడు. జమేదారు చిరునవ్వు నవ్వి చెప్పాడు- "బిల్లేసుర్ నీకు ఈ నౌకరీ రాదు కానీ ఏ సిపాహి అయినా సెలవులో వెళ్లినప్పుడు వాడి స్థానంలో నిన్ను నియ మిస్తూ వుంటాను. జీతం నష్టం మీద వెళ్లేవాళ్ల జీతం నీకు యిప్పిస్తాను."

బిల్లేసురుడు తన ఉన్నతికి సంతోషించాడు. ఈలాగా ఒక సంవత్సరం దొర్లిపోయింది.

## నాలుగు

సత్తీదీన్ భార్య అత్తగారింటికి వచ్చి అనేక సంవత్సరాలు గడిచాయి. ఆమె జగన్నాథుని దర్శించుకోలేదు. డబ్బుకేలాంటి లోటు లేదు. ఒక రోజు జమేదార్‌ను అడిగింది - "జమేదార్‌గారూ! మనకు డబ్బు కావలసినంత ఉంది, కానీ పిల్లా-జల్లా అంటూ సంతానం లేకపోయే. మీరు-నేను ప్రాణాలు వదిలాక ఈ డబ్బంతా వృధాగా ఎవరి పరమో అవుతుంది. నేనీయింటికి వచ్చి ఎంతో కాలం గడిచిపోయింది కానీ యింత వరకు నేను జగన్నాథుని దర్శించుకోలేక పోయాను. ఇప్పుడు ఆయన్ను దర్శించుకొని మనసులోని కోరిక చెప్పుకోవాల నివుంది." "తండ్రీ! నాకు సంతానాన్ని ప్రసాదించు. నేను నీ కాళ్ల మీద పడి నూట ఒక్కరూపాయి మొక్కుబడి చెల్లించు కుంటాను. ఎన్నో ప్రాంతాల నుండి వచ్చి ఆయన్ను సేవించుకుంటారు. వారి కోరికలు నెరవేర్చు కొని వరాలుపొంది వెళ్లుంతూవుంటారు. ఆ వరాల దేవుడు తీర్చలేని దంటూ ఏముంది?" యిలా అంటూ ఏదో జ్ఞప్తికి తెచ్చుకోని వెక్కివెక్కి ఏడ్వసాగింది.

కొద్ది నిముషాలు గడిచిన తర్వాత కళ్లుతుడుచుకొని ఎక్కిళ్లుపడుతూ అన్నది. "నాకు అన్ని సుఖాలు లభించాయి. మనసుకు నచ్చిన మగడు, మగడికి తగ్గ యిల్లు, ధనం, నగలు, మాన-మర్యాదలు, బట్టలు అన్నీ ఉన్నాయి. పాడి-పంట లకు ఏలాంటి లోటులేదు. కానీ-ఊ!ఊ!ఊఁ- మళ్లీ ఏడ్పు లంకించుకుంది - సంతానంలేని కొరత వుందని అంటూ.

సత్తీదీన్ ఆమెను కౌగలించుకొని ఓదార్చసాగాడు. "యిప్పుడేమంత నీకు ఎక్కువ వయసు వచ్చిందని ఏడుస్తున్నావు? మొదటి భార్య మాట వేరు. ఆమె పాపం తిరుగలి విసరుతూ వెళ్లిపోయింది. ఐదేండ్ల క్రిందటే గదా నిన్ను పెళ్లాడి తెచ్చుకున్నాను. నీ వయస్సు యిప్పుడు యిరువది ఏండ్లు వుండవచ్చా?"

వెక్కివెక్కి ఎడుస్తూ ఆమె అన్నది, "నాకు యిప్పుడు పందొమ్మిదో ఏడు నడుస్తోంది." నిజానికి ఆమె వయస్సు యిరువదిఐదేళ్లకంటే ఎక్కువ గానే వుంది. "అలా అయితే నీకు తొందరేమి వచ్చింది? నేను ఏమంత ముసలి వాడిని. కాకపోతే పిల్లా-జల్లా ఎప్పుడు కలగాలో, అప్పుడే కలుగు తారు," సత్తీదీర్ సముదాయించాడు.

"అలా అనకండి! జగన్నాథుని కృపవల్ల కలుగుతూ వుంటారు."

సత్తీదీన్ గంభీరముద్ర వహించి మళ్లీ అందుకున్నాడు. "జగన్నాథుని కృప అన్ని వైపులావుంది. ఈ పెద్ద హోదా కూడా ఆయన దయవల్లే గదా లభించింది. ఆయన దర్శనం ప్రతి నిత్యం మనస్సులో చేసుకొంటూనే వుంటాం. పూరీకి వెళ్లాలనుకుంటే ఎప్పుడైనా వెళ్లవచ్చు. పదిరోజులు సెలవు తీసుకుంటే వెళ్లిరావచ్చు. ఇదే మంత పెద్దసమస్య?"

భార్యకు ధైర్యం చెప్పాడు సత్తీదీన్. అదే సమయానికి బిల్లేసురుడు అక్కడి కొచ్చాడు, జమేదార్ అతన్ని అడిగాడు - "బిల్లేసుర్! జగన్నాథపురికి వస్తావా?"

బిల్లేసురుడు మాత్రం ఖర్చుభరించ దలచకోలేదు. సత్తీదీన్ ఆ విషయం పసికట్టాడు. కానీ పాపం, అతని వద్ద మిగులుపాటు ఏమాత్రం ఉంటుంది? యిలా ఆలోచించి మళ్లీ అతనే అన్నాడు. "పదిరోజులు సెలవు మంజూరు చేయించుకో... వచ్చే ఆదివారం బయలు దేరుదాం. వాస్తవానికి సత్తీదీన్‌కు తోడుగా ఒక నౌకరు కావలసివుంది."

బిల్లేసురుడు మరొక సిపాయి స్థానంలో డ్యూటీ చేస్తున్నాడు కాబట్టి కచేరీలో అతని హాజరీ అనివార్యమైపోయింది. సత్తీదీన్‌కు ఆవుల పోషణార్థం

మరొక నౌకరును ఏర్పాటు చేసుకోవలసి వచ్చింది. బయట పనులన్నీ బిల్లే సురుడే చేసిపెట్టేవాడు. ఈ మధ్య వాళ్లు వేరు-వేరుగా వుంటున్నారు. బిల్లే సురుడు కూడా వంట స్వయంగా చేసుకునేవాడు.

కానీ ఖర్చుకాకుండా జగన్నాథుని దర్శనాలు లభిస్తున్నాయి. బిల్లేసు రుని ఆనందానికి అవధుల్లేవు. అతడు సెలవు మంజూరు చేయించుకున్నాడు. వచ్చే ఆదివారం సత్తీదీన్ సామానుల రక్షకుడుగా సత్తీదీన్ అతని భార్య వెంట జగన్నాథుని దర్శనార్థం బయలుదేరుతాడు.

సత్తీదీన్ భార్యకు జగన్నాథుని దయాదృష్టి ప్రసరించగానే ఆమెకు గర్భధారణ కలుగుతుందని ఎలా గాఢమైన విశ్వాసమున్నదో ఆలాగే సత్తీదీన్ కోరుకున్నంత మాత్రానే అతని ఉద్యోగం పర్మనెంట్ అవుతుందని. ఒకటిన్నర యించ్ కాదుగదా, అరడుగు ఎత్తు తక్కువైనా పరవాలేదని ధృడ విశ్వాసంతో వున్నాడు. దేవుని పట్ల తన విశ్వాసాన్ని ఫలింపజేసుకునేందుకు బిల్లేసు రుడు దారిలో ఏదో ఉపాయం ఆలోచిస్తూ వచ్చాడు.

పూరీ చేరుకొని అంతా ఎంతగానో ఆనందించారు. ఆలాంటి దృశ్యం వాళ్లు కాన్పూరు - బర్ద్వాన్ మధ్య ఎక్కడా చూచి ఉండలేదు. సముద్ర తీరం ఇసుకతిప్పలు, చూచి ఆనందించారు. జగన్నాథుని స్మృతి చిహ్నంగా అనేక గవ్వలు, శంఖాలు వెంటతెచ్చారు.

మార్కండేయ మందిరము, వటకృష్ణుడు, చందన సరోవరము మొదలగు ప్రసిద్ధ స్థలాలన్నీ తిరిగిచూచారు. మందిర ప్రాంగణంలోనే ఎన్నో చిన్నచిన్న దేవాలయాలున్నాయి. ఏకాదశినాడు అక్కడ తలక్రిందులు. వ్రేలాడుతూ వుండడం పరిపాటి. సత్తీదీన్ అన్నాడు, "యిక్కడ జగన్నాథ బాబాగారి ప్రభావ మహిమ వల్ల ఏకాదశి తలక్రిందులుగా వ్రేలాడతీయబడుతుంది. ఆకారణంగా యిక్కడ ఎవరూ ఏకాదశి వ్రతం ఆచరించరాదు." బిల్లేసురుడు ఆ విగ్రహానికి చేతులు జోడించి నమస్కరించాడు. ఆ తర్వాత వాళ్లు కలియుగమూర్తి దర్శనార్థం వెళ్లారు. కలియుగమూర్తి తన భార్యను భుజాలమీద ఎక్కించుకొని తండ్రిని కాలినడకతో నడిపిస్తున్నాడు. సత్తీదీన్ భార్య ఆదృశ్యాన్ని ఎంతో శ్రద్ధగా అవలోకించింది. అక్కడ చాలా రోజులు ఆనందంగా గడచిపోయాయి. ఆ తర్వాత భువనేశ్వర్ వెళ్లేందుకు ప్రయాణంకట్టారు.

జగన్నాథక్షేత్రంలో ఎంగిలి అంటూ ఏమీ ఉండదు. ఇతరుల ఎంగిలి పదార్థాలు తినటం అక్కడ సహజం. వాళ్ళ ప్రాంతాలలో మడి-ఆచారం పాటించాల్సి వుంటుంది. మరి యిక్కడ ఏలాంటి కట్టుబాట్లు లేకుండా ఎంగిలి

మెతుకులు ఆరగిస్తారు. ఈ ఆచారాన్ని ఎవరూ తప్పుగా భావించరు. బిల్లేసురుడు తన విస్తరిలోని ఎంగిలి మెతుకుల్ని జమేదార్, ఆయన భార్య విస్తర్లలో పడ వేశాడు, అందుకు వారేమాత్రం ప్రతివాదన చేయక నవ్వుతూ ఆరగించారు.

రెండు రోజులు గడిచాయి. మూడో రోజు జమేదారు, బిల్లేసురుడు స్నానాలు ముగించుకొని వచ్చారు. బిల్లేసురుడు జమేదార్ కాళ్లపైనపడి సాష్టాంగ ప్రణామం చేశాడు. "బిల్లేసుర్! ఏమిటీ విపరీతం!" జమేగారు అడిగాడు. బిల్లేసురుడు కరుణ స్వరంతో "ఏమీ లేదు బాబా! నన్ను ఈ భవసాగరం నుండి ఉద్ధరించండి," అని మొరపెట్టుకున్నాడు.

"నేనెలా నిన్ను భవసాగరం నుండి ఉద్ధరించగలను?" నా కాళ్లు వదలి పెట్టు! "జమేదార్ బదులుచెప్పాడు."

"బాబా! నాకు గురుమంత్రం ఉపదేశించండి!" "యిక్కడ అంతా ఒకరిని మించి మరొకరు గురువులే. నా కాళ్లు వదలి నీవెవరితోనైనా మంత్రం పోందు!" సత్తీదీన్ తనకాళ్లను వదలించుకోబోయాడు.

"నా దృష్టిలో మిమ్మల్నిమించిన గొప్పవార్లు మరెవరు లేరు. నామీద దయ వుంచండి!"

"నాకు గురు మంత్ర మంటే ఏమిటో తెలియదు. గాయత్రీ మంత్రం మాత్రమే నాకు తెలుసు." "బాబా! గాయత్రీ మంత్రాన్ని మించి మరోమంత్రం లేదు. ఆ మంత్రమే నాకు ఉపదేశించండి."

"జందెం ధరించినప్పుడే నీవు గాయత్రీ మంత్రం విన్నావుగదా?"

"నే మరచాను! మీ కాళ్ల ప్రమాణంగా చెబుతున్నా. నిన్నరాత్రి నేను కలకన్నాను. బాబా జగన్నాథుడు నాకు కలలో చెప్పాడు... ఆ కలను చెప్పానంటే అది ఏమాత్రం ఫలించదు."

కలల మాట విని సత్తీదీన్ భార్యదేహం పులకరించింది. ఆమె యిలా అన్నది-"బిల్లేసుర్! నీవు ఆయన పాదాలు వదిలిపెట్టు! నీకు బాబా కలలో చెప్పివుంటే జమేదారు నీకు తప్పక గురుమంత్రం ఉపదేశిస్తారు. నీవిలా రా! ఆ కల ఏమిటో నాతో చెప్పు!"

సత్తీదీన్ భార్య నుండి మాట పొంది బిల్లేసురుడు అతని కాళ్లను వదలిపెట్టాడు. ఆ తర్వాత ఆమె గది వైపువెళ్లగా బిల్లేసురుడు ఆమెను అనుసరిచాడు. అక్కడికెళ్లిన తర్వాత బిల్లేసురుడు తను కన్న కల సమాచారం తెల్పాడు. "నేను గాఢనిద్రలో వుండగా బుస్సు - అంటూ ఒక అగ్ని జ్వాల ఎగిసింది. జ్వాల మధ్యన మూడు ముఖాల ఒక వ్యక్తి కూర్చొనివున్నాడు. అతడిలా

అన్నాడు" బిల్లేసురా! నీవు బీద బ్రాహ్మడివి, పీడింపబడ్డావు, భయపడకు. నీవు ఎవరి వెంట వచ్చావో, వారికి సేవ చేయి! వారితో యిక్కడే గురు మంత్రం పొందు! నీకు అన్ని సుఖ-సంతోషాలు సంతానం కల్గుతుంది. ఈమా టలు చెప్పి ఆ వ్యక్తి అదృశ్యుడైనాడు."

సత్తీదీన్ భార్య ఆలోచించింది. తన ఫలితం వ్యతిరేకంగా జరిగింది. నిజానికి ఆ కల ఆమె కనవలసివుండినది. ఏమైనా తనవల్ల పొరపాటు జరి గిందేమో! ప్రతి సోమవారం జగన్నాథ బాబాపేర నెయ్యి దీపాలు వెలిగించా లని సంకల్పించింది. ఆపైన సత్తీదీన్‌తో మంత్రం ఉపదేశించవలసినదిగా కోరింది. సత్తీదీన్ కంఠీ, మాల, మిఠాయి, కండువా బజారుకెళ్లి కొనుక్కు రావలసిందిగా బిల్లేసురుని పంపాడు. బిల్లేసురుడు అఘ-మేఘాల మీద వెళ్లి అన్నివస్తువులు కొనుక్కొచ్చాడు. సత్తీదీన్ బిల్లేసురునికి గాయత్రీ మంత్రంతో దీక్షనిచ్చాడు.

బిల్లేసురుని శ్రద్ధా-భక్తుల ప్రభావం సత్తీదీన్ భార్యపై కూడా ప్రసరిం చింది. జగన్నాథుని దర్శన భాగ్యం బిల్లేసురునికే కల్గింది. తన దర్శనాలు వృధా అయ్యాయి అనుకుంటూ- "జమేదార్! నాకు మంత్రోపదేశంచేయండి," అని అడిగింది. "అలాగా! పండాగారిని సంప్రదిస్తాము!" జమేదార్ అంటూ వుండగానే భగవదేచ్ఛగా పండాగారు ప్రవేశించారు. సత్తీదీన్ కోరికపైన పండిత్‌జీ అతని భార్యను తిలకించి యిలా అన్నాడు, "నీకింకా మాసిక ధర్మం అవుతోంది. ఉపదేశాన్ని నీవు పాటించలేవు."

సత్తీదీన్ భార్య నిరాశ చెందింది. సత్తీదీన్‌కు పండిత్‌జీ సలహా యిచ్చాడు- "నాల్గవ ఆశ్రమంలో గురుమంత్రం పొందడం లాభదాయకంగా వుంటుంది. మాసిక ధర్మము ఆగిపోనంత వరకు మంత్రాన్ని పాటించడం సులభంకాదు. అశుద్ధంగా ఉండడం జరుగుతుంది. అనేక రకాలుగా కాలుజారే అవకాశాలుం టాయి." పండిత్‌జీ సలహాకు సత్తీదీన్ తాళం వేశాడు.

పూరీ క్షేత్రంనుండి భువనేశ్వరుకు వెళ్లి దైవదర్శనాలు చేసుకొని బర్ద్వాన్‌కు చేరుకున్నారు.

## ఐదు

సత్తీదీన్ భార్య ఒక సంవత్సరం జగన్నాథుని శక్తిని పరీక్షించింది. ప్రతిసోమ వారం నెయ్యితో దీపం వెలిగించేది. ప్రతిమాసం చివరివరకు ఎదురు చూచేది. కానీ ఎలాటి ప్రయోజనం కలుగలేదు.

బిల్లేసురుడి భక్తి-శ్రద్ధలు ఎక్కువకాసాగాయి. త్రిపుంధ్రం, మాల, గాయత్రీ మంత్రంతో అతనితో ప్రఖరత్వంపెరుగ సాగింది.

ఒక సంవత్సరం గడచినా జగన్నాథుని కృప కలుగలేదు, ఆ కారణంగా సత్తీదీన్ భార్యకు ఆ దేవదేవునిపైని కోపం కలిగి దివ్యశక్తిని వదలి మానవ శక్తిని విశ్వసించేందుకు నిర్ణయించుకొంది. అభ్యుదయ రచయిత లాగా!

బిల్లేసురుని గురుమంత్రాన్ని అందరూ అపహాస్యం చేయసాగారు. అతని పరిస్థితిలో కూడా ఏమాత్రం మార్పు కల్గలేదు. అతను తన గ్రామానికి వెళ్లి తన సమాజంలో కలసిపోవాలని నిశ్చయించుకున్నాడు. ఇక్కడ జమీందారీ బానిసత్వం కన్నా గురువు - శిష్యత్వం - బానిసత్వం చాలా కఠినంగాతోచాయి అతనికి. పైగా యిక్కడి వాతావరణం కూడా అతనికి అనుకూలంగా లేదు. మనసు విప్పిమాట్లాడేవాళ్లు అసలేలేరు.

గురుపత్ని యధార్థ వాదం కూడా బిల్లేసురుడికి రుచించలేదు. ఒకరోజు అతను తన జపమాల, కంఠీ తీసుకవెళ్లి గురుపత్ని ఎదుట వుంచి తన నిశ్చయాన్ని తెలిపాడు - "తల్లీ! నేను మావూరు వెళ్లేందుకు సెలవు తీసుకున్నాను. మళ్లీ వస్తానో, రానో, చెప్పజాలను. ఈ కంఠీ- మాల పుచ్చుకొండి. నేను యిక గురువుగారికి శిష్యుడుగా వుండ దలచుకోలేదు. నీవు కూడా గురువుగారి లాంటి దానివే. ఈ మంత్రం పుచ్చుకో!" అంటూ ఆమంత్రాన్ని జపించి బయలుదేరాడు. వెళ్లుతూ పాదాభివందనం కూడా చేయలేదు.

## ఆరు

బిల్లేసురుడు స్వగ్రామం చేరుకున్నాడు. అతని బొడ్డు కింద పంచెకొంగులో రూపాయలు మూటగట్టి వున్నాయి. పెదవులపై చిరునవ్వు నాట్యమాడుతోంది. ఆ గ్రామం జమీందారు, వడ్డీ వ్యాపారస్థులు, ఇరుగు-పోరుగువారు - అందరి దృష్టి అతని మీద పడింది. 'ఏమాత్రం సంపాదించుక వచ్చాడో!' అని అంతా ఊహాగానాలు చేయడం మొదలెట్టారు. వారందరి మనో మందాకినిలో బిల్లేసురుడు లక్ష్మికి దూరం కావాలనే అవ్యక్త ధ్వని వినిపించింది. రాత్రుల్లో బిల్లేసురుని భగ్నగృహంలో ప్రవేశించి అతడు సంపాదించుకొని వచ్చిన డబ్బు, వస్తు సముదాయాన్ని దోచుకపోవాలని దోపిడి దొంగలు లాఠీలతో అవకాశం కోసం ఎదురు చూడసాగారు. ఒక రోజు ఏదో మంచి ప్లానుతో త్రిలోచనుడు తన జ్ఞానచక్షువును తెరచి ఎంతో ఆప్యాయంగా బిల్లేసురుడి ఇంటికి చేరి

అడిగాడు. "బిల్లేసురా! నీవు గ్రామంలోనే స్థిరపడిపోవాలనుకొని వచ్చావా? లేక మళ్లీ వెళ్లాలను కుంటున్నావా?"

బిల్లేసురుడు త్రిలోచనుడి స్వభావాన్నే కాదు. అతని తండ్రి జాతకాన్ని గూడా బాగా ఎరిగినవాడు. అతని చరిత్ర అంతా బిల్లేసురుడికి కంఠస్థమే. అయితే హిందీభాష బ్లాంక్‌వర్స్ ప్రసిద్ధ కవిలాగా ఏదో కవిసమ్మేళనంలో గానీ, లేక ఏపెద్ద మనిషి యింటి సమావేశంలోనూ తను తెలుసుకున్న దానిని వినిపించేవాడు కాదు. మంద హాసం చేస్తూ యిలా అన్నాడు- "అన్నా! ఇక గ్రామంలోనే వుండిపో వాలనుకుంటున్నాను. బెంగాలు నీళ్లు నాకు సరి పడడంలేదు."

త్రిలోచనుని మూడో కంటిలో కొంత వెలుగు కన్పించింది. ఒకడుగు ముందుకు వేసి సహానుభూతిని ప్రదరిస్తూ - "చాలామంచిది. మంచి నిర్ణ యమే తీసుకున్నావు. మరి యిక్కడ ఏం చేయాలను కుంటున్నావు?" అని అడిగాడు.

"యింత వరకు నేనేమీ నిర్ణయించు కోలేదు." బిల్లేసురుడు నవ్వుతూనే ముక్తసరిగా జవాబుచెప్పాడు.

"ఊట లేని బావి కూడా ఎండిపోతుందని సామెత! మరి నీవు కూర్చుని తింటూంటే ఈ డబ్బు ఎన్నిరోజులుంటుంది?"

"ప్రస్తుతానికి యిలాగే దినాలు గడుపదలచాను!" "అలా అనకు. ఈ గ్రామస్థులున్నారో మహాదుష్టులు. పోలీసు ఠాణాలో రిపోర్టు వ్రాయించి గుండాల లిస్టులో నిన్ను యిరికించేస్తారు. అందరికి నా దగ్గర వున్న డబ్బు ఖర్చవగానే మళ్లీ సంపాదించుకుంటానని చెప్పు."

బిల్లేసురుడు చలించిపోయాడు. "అవును, నీవు చెప్పేది కూడా నిజమే! ఈ రోజుల్లో మంచి చేయబోతే చెడు ఎదురవుతోంది. ప్రజలంతా అనుకోవ చ్చుగదా - వీడి వద్ద ఏమీ లేకుంటే ఎలా కూర్చొని తినగలడు? బహుశా దొంగతనం చేస్తూన్నాడేమో! అని భావించవచ్చు గదా?"

త్రిలోచనుడు మనస్సులో బిల్లేసురున్ని కొరక రాని కొయ్యగా భావించి మరొక వల విసిరాడు - "దీనానాథ్ కూడా ఈలాగే చాలా చలాకీగా మాట్లాడే వాడు. అతన్ని గుండాల లిస్టులోచేర్చారు. రాత్రిల్లో అతని మీద నిఘావుంటోంది మరి!"

అయినా కూడా బిల్లేసురుడు అతని వలలో పడలేదు. చాలా జాగ్రత్తగా జవాబిచ్చాడు. "పోలీసువాళ్లు కూడా మనిషి ముఖం చూచి అతను ఎలాంటి

వాడో బాగా గుర్తిస్తారు. నేను నాపొలం రామదీన్‌కు కౌలుకుయిచ్చి వెళ్లి యుంటినిగదా! మళ్లీ నేను స్వయంగా ఆ పొలంలో వ్యవసాయం చేసుకుంటాను."

త్రిలోచనుడికి కొంత పట్టు దొరికింది. "యిది చాలామంచి ఐడియా! కానీ నీకు ఎద్దులంటూ లేవు గదా! వ్యవసాయం ఎలా చేస్తావు?"

బిల్లేసురుడు కొంత చిక్కులో పడ్డాడు. "అందుచేతనేగదా నేనింకా ఏ నిర్ణయానికి రాలేక పోతున్నానని చెప్పాను," అన్నాడు.

త్రిలోచనుడి కోపంకట్టలు తెంచుకోబోతోంది. కానీ అందువల్ల అతను సాధించేదంటూ ఏమీ వుండదు. కొంత నిగ్రహం వహించి - "అలా అయితే మా ఎడ్లు కొంటావా?"

"మరి నీవేంచేస్తావు? నీకు కావాలి గదా?" "నేను పెద్ద జత కొనాలనుకొంటున్నా. కానీ నా ఎడ్లకు నీవు నూరు రూపాయలు చెల్లించాల్సి వుంటుంది సుమా!"

బిల్లేసురుడికి నూరురూపాయలు ఎక్కువ వెలగా అనిపించలేదు. ఆలోచించి బదులు చెప్పాడూ "సరే! రేపు నా నిర్ణయం తెలియజేస్తా!"

త్రిలోచనుడు ఏదో పనిమీద మిషపెట్టి అక్కడి నుండి వెళ్లి పోయాడు. అతడు వెళ్లుతూ మనసులో అంచనావేశాడు. వందరూపాయలు నగదు చెల్లించి ఎడ్లు కొనేవాడి వద్ద కనీసం ఐదారు వందలైనా నగదు వుండాలి? ఆ రూపాయలను ఎలా వసూలు చేయాలో సలహా తీసుకునేందుకు మరో ఆసామి యింటికి వెళ్లాడు.

త్రిలోచనుడు వెళ్లగానే బిల్లేసురుడు ఇంటిలోనికి వెళ్లి కొద్ది నిముషాలో తయారై బయటకు వెళ్లిపోయాడు. దారిలో అతన్ని అందరూ అడిగారు - "బిల్లేసురా! ఎక్కడికీ ప్రయాణం! అని."

కరణం గారింటికి వెళ్తున్నానని బిల్లేసురుడు జవాబు చెప్పాడు.

సంధ్యా సమయంలో బిల్లేసురుడు గర్భం ధరించిన మూడు పెద్ద మేకలను తోలుకుంటూ ఒక వ్యక్తితో సహా ఇంటికి వెళ్లుతున్నట్లు గ్రామస్థులంతా చూచారు. గ్రామంలో ఒకటే గోల! అంతా నిట్టూర్పు విడచి మౌనం వహించారు.

మేకల సమాచారం తెలుసుకొని త్రిలోచనుడు బిల్లేసురుడి యింటికి చేరి అన్నాడు. "మేకలు తెచ్చి చాలా మంచి పనిచేశావు. యిక ఎడ్లు కూడా వస్తే నీ యిల్లు కళకళలాడు తుంది."

"ఎడ్లు కొనే అభిప్రాయం మార్చుకున్నాను. వాటికి మేత, నీట్లు పెట్టడం

ఒక పెద్ద సమస్య! మేకలకు ఆకులు కోసి వేస్తే నమలు కొని నెమరు వేసు కుంటూ వుంటాయి. ఎడ్లను కట్టివేస్తే నేను ఒక ఎద్దు కావలసి వస్తుంది!" బిల్లేసురుడు తన అభిప్రాయం నిర్మొగమాటంగా తెలియజేశాడు.

"అయితే మరి వ్యవసాయం?" "కౌలుకో, గుత్తకోఇచ్చి పొలం చేయిం చుకుంటాను."

## ఏడు

బిల్లేసురుడు ఒక పొడుగాటి వెదురు పంగకు కొడవలికట్టి - రావి, జువ్వి, మర్రి చెట్ల కొమ్మలు - రెమ్మలు కోసి మేకలకు వేయాలనుకున్నాడు. ఆ ప్రయత్నంలోనే మధ్యాహ్నం కాబోతోంది. బిల్లేసురుడు మేకలను తోలుకుంటూ గ్రామమధ్యలో నున్న దారివెంట బయలుదేరాడు. దారిలో దామదీన్ కనబ డ్డాడు. "బ్రాహ్మణుడి యింట పుట్టి మేకలు మేపుకుంటావా? అయితేనేమి చాలా మంచి మేకలే తెచ్చావు. బాగా పాలు యిస్తాయి. ఇక రెండు సంవత్స రాలలో మేకలతోనే నీ యిల్లు నిండిపోతుంది. ఆదాయం కూడా బాగా వస్తుం దిలే?" అంటూ పేరాశతో మేకలను చూస్తూవుండిపోయాడు, తనదృష్టిని మరల్చకుండానే! దారిలో బిల్లేసురుడికి అనేక మందికి జవాబు చెప్పాల్సిన అవసరం లేకపోయింది. అతడు మనస్సులో యిలా అనుకున్నాడు - "అవసరం కలిగిన సందర్భాలలో బ్రాహ్మణులు మడి పట్టాల్సి వచ్చింది, చెప్పుల దుకాణాలు తెరవాల్చి వచ్చింది. ఆలాంటి పరిస్థితిలో మేకలు మేపడం తప్పు ఎలా అవుతుంది?" కుమ్మరి లలయీ ఆము మీద కుండలు తయారు చేసుకుంటున్నాడు. మేకలను చూడగానే ఒక క్రామేడ్‌లాగా అతని ఉత్సాహాన్ని యినుమడింపజేశాడు. బిల్లేసురుడు ఆనందంగా ముందుకు సాగాడు. కొద్ది దూరంలో దేవాలయంవుంది. దేవాలయం లోపల మహాదేవుడు, బయట వెనుకవైపుగా మహావీరుడు ప్రతిష్ఠింపబడి ఉన్నాడు. బిల్లేసురుడు గురు మంత్రం త్యజించి ఉన్నాడు. అయినా కూడా తన మేకలను తోడేళ్ల బారినుండి రక్షిం చుకోవాలనే సంకల్పంతో దేవాలయంలోనికి వెళ్లాడు. అతనికి మహాదేవుని కంటే మహావీరుడే అధికశక్తి సంపన్నుడుగా తోచాడు. అంతేగాకుండా మహా వీరుని దగ్గరకి వెళ్లుతూ ఆదారిన వెళ్లే మేకల మీద కూడా అతడు తన దృష్టిని కేంద్రీకరించవచ్చు. మహావీరుని కాళ్లు స్పర్శించి మనసులో ఏదో

భావన చేసుకొని మేకలవెంట బయలుదేరాడు. పొలాల పచ్చదనానికి ఉవ్విళ్ళూరి అటువైపు పరుగిడుతున్న మేకను అదిలించి బిల్లేసురుడు ముందుకు నడిచాడు. మన్నూ బావివద్ద దారివైపు వ్రేలాడుతున్న రావికొమ్మలను దోటీతో కోసి బిల్లేసురుడు మేకల ముందు పడవేశాడు. కొమ్మల పచ్చటి ఆకులను చూడగానే మేకలు మేతకు ఉపక్రమించాయి. బిల్లేసురుడు దోటిని కొమ్మల కానించి బావి కట్టడం మీద ఎక్కి కూర్చున్నాడు. బావికి ఎదురుగా ఒక బీడు ప్రదేశంవుంది. మరో వైపు వర్షాకాలంలో ప్రవహించే కాలువ. పశువుల కాపర్లు పశువులు మేస్తూవుంటే అటూ-యిటూ నిలబడివున్నారు. వాళ్ల దృష్టి బిల్లేసురుడి మీద, అతని మేకలపైని పడింది. అతన్ని ఏడిపించాలని వాళ్లు ఉబలాటపడ్డారు. మేకలను తరిమి కాలువలో పడవేయాలని ఆలోచించారు. బిల్లేసురుడు మేకలను వెదకి వెదకి వేసారిపోతాడు. అవి అతనికి మళ్లీ దొర కవచ్చు - దొరకకపోవచ్చు! అది అతని అదృష్టం. ఒకడు సలహాయిచ్చాడు. కసాయి వాడిని పిలిపిస్తే అతను కాలువలోనే మేకలను చంపి కాలువ బయట పడేస్తాడు. మనకు కొంత మాంసం దొరకవచ్చు గదా? మరొకతను కొంత ఉదాసీనత చూపిస్తూ ఆ మేకలు గర్భంతో వున్నాయి. వాటి మాంసం ఎలా తినగలం, అన్నాడు. అయినా కూడా ఆ మేకలను అక్కడనుండి తరిమి వేయాలనే ఆలోచన మాత్రం అందరికి కలిగింది. వాళ్లంతా లోలోపల సంప్ర దించు కొని కొంత మంది కాలువ ఒడ్డున నిలబడ్డారు. మరికొంత మంది బిల్లే సురుడి దగ్గర చేరారు. వారిలో ఒకతను మెల్లగా పెద్దయ్యా! ఆడుకుందామా?' అన్నాడు. బిల్లేసురుడు మందహాసంచేస్తూ- "అరే మీబాబును పిలువురా, నీవు నాతో ఏమి ఆడుకోగల్గుతావు?" అంటూ మేకల వైపు పరిశీలనగా దృష్టి సారించాడు, మరొకడన్నాడు. "పెదనాన్న! నీకు ఆడుకోవాలని కోరిక లేకుం టేపోనిద్దు, పరదేశం వెళ్లి వచ్చావుగదా! అక్కడి కబుర్లు చెప్పు, మేము వింటాం." బిల్లేసురుడు ముక్తసరిగా జవాబిచ్చాడు "ఎవడు చావకుండా స్వర్గాన్ని చూడలేడు కదా? నీవూ పెద్దవాడివైన తర్వాత పరదేశం వెళ్లితే అక్కడి సమాచారాలేమిటో స్వయంగా తెలుసుకోగలుగుతావు, సరేనా?" మూడోవాడు భయపెడుతూ సహానుభూతిని చూపించాడు. "ఇక్కడ మేమంతా వున్నాం. కాని నీకు తోడేళ్ల భయం ఏమీ లేదు. కాని అటువైపుగా పైకి వెళ్లావంటే మరేమి లేదు!" అతని మాటలకు బిల్లేసురుడేమాత్రం చలించక - "ఆ! అవును. అలాగే! యిటువైపు కూడా తోడేళ్ల బెడదవుంది. అయితే తోడేళ్లు మనిషి వేషం మార్చుకొని వస్తాయిలే" అని చురక అంటించాడు.

అటు తర్వాత బిల్లేసురుడు నిలబడి చూచాడు. మేకలు ఆకులన్నింటిని నిశ్శేషంగా తినేశాయి. బిల్లేసురుడు దోటి అందుకొని మేకలు తోలుకుంటూ మరో దిశకు వెళ్లాడు. దారిలో దీనానాథ్ కన్పించాడు. లోభి చూపులతో మేకలను తేరిపార చూచి-"బిల్లేసుర్! ఈ మేకలను ఎంతకు కొన్నావేమిటి?" అని అడిగాడు. బిల్లేసురుడు అతని మనసులో భావాన్ని పసికట్టి - "సరి-సరికి తీసుకున్నా" అన్నాడు. బిల్లేసురుడు అదృష్టానికి దీనానాథ్ పిలక నిక్కబొడు చుకుంది. అతడు విస్మయంచెంది - "మూడు మేకలు సరి-సరికే తీసుకు న్నావా?" అని అడిగాడు. బిల్లేసురుడు వ్యంగ్యంగా చిరునవ్వు విసరి- "మరి లేకపోతే ఒకే మేకను తీసుకొచ్చా ననుకుంటున్నావా?"

"సరికి-సరి అంటే మేకలు నీకే, పాలు నీకే! చచ్చిపోతే శవము అత నికి, పిల్లలు చెరిసగమనేకదా నీ అర్థం?" అని దీనానాధుడు ఈర్ష్యగా అడి గాడు. "ఆఁ! అవును. అంతే!" ముక్తసరిగా జవాబిచ్చాడు బిల్లేసురుడు అతడి పీడ వదిలించుకోవాలనే భావంతో.

బిల్లేసురుని జవాబుతో అతనికి నడుము విరిగినంత పని అయింది. బిల్లే సురుని అదృష్టానికి మనసులో మధనపడుతూ - "భగవంతుని దయ ఎప్పుడు ఏలా వుంటుందో ఎవరు ఊహించగలరు?" అని మౌనం వహించాడు దీనానా ధుడు. అతని ముఖ కవళికలను గమనించిన బిల్లేసురుడు దీనానాధుని చూపుల్లో అసూయను పసికట్టాడు. అతని జీవితంలో ఈలాంటి ఎదురు దెబ్బలు తింటూ వాటి నుండి తనను రక్షించుకుంటూ జాగ్రత్తగా రోజులు గడుపుతున్నాడు, బిల్లేసురుడు. అక్కడనుండి కొంతదూరం వెళ్లి రావి కొమ్మలు కోసి మూటకట్టాడు. యింటివద్ద మేకలకు మేత కావాలిగదా! ఈలోగా మేకలు కడుపునిండా మేతమేసాయి. బిల్లేసురుడు ఆకులమోపు తలమాద వేసుకొని మేకలను అదలించుకుంటూ యిల్లు చేరుకున్నాడు.

## ఎనిమిది

బిల్లేసురుని యిల్లు అన్నదమ్ముల పంపకాలతో చాలా అరలుగా విభజింప బడింది. తనభాగంలో మేకలతోపాటు నివసించడం అతనికి అసాధ్యంగా తోచింది. మేకల వాసన భరించలేక అన్నదమ్ములు గొడవచేస్తూవుండే వారు. పాత యిల్లు అయిన కారణంగా కొన్ని గోడలు శిథిలమైనాయి. గోడల సందుల్లో

నుంచి దొంగలు రాత్రుల్లో తోడేళ్ళుగా ప్రవేశించే ప్రమాదం కూడా వుంది. ఈ కారణంగా బిల్లేసురుడు అదే గ్రామంలో ఖాళీగావున్న పాత యిల్లు కుదుర్చుకున్నాడు. ఆ యిల్లును అతను కొనలేదు. కాని విరిగినకప్పును సరిచేయించి ఆ యిల్లు పడిపోకుండా మరమ్మత్తులు చేయించుకొంటూ దానిని కాపాడే షరతు మీద ఆ యింటికి చేరాడు. ఆయింటి యజమాని పరదేశంలో వుంటున్నాడు. అతడు మళ్లీ ఆ యింట్లో ప్రవేశించే పరిస్థితి కూడా లేదు. ఒక రకంగా పరదేశంలోనే అతను తన స్థిర నివాసం ఏర్పరచుకున్నాడు. అయితే మరోషరతు ఏమిటంటే అతను ఎప్పుడైనా ఆ యిల్లు కావాలనుకుంటే అతను కోరిన ఆరు నెలలలోగా ఆ యింటిని బిల్లేసురుడు ఖాళీచేయాల్సి వుంటుంది. ఆ యింటి యజమాని అదే గ్రామంలోని ఒక ఆసామికి యాజమాన్యం బాధ్యత ఒప్పగించి వెళ్లాడు. ఆ ఆసామి పదహారు అణాలు కానుక తీసుకొని బిల్లేసురుడికి ఆ యిల్లు సమర్పించాడు.

ఆ యింటి యజమాని కూడా ఒకప్పుడు బిల్లేసురుని లాగా దేశివాడే. అతను దేశ దారిద్ర్య బాధ నుండి ఎముక్తి పొందాలనే అభిప్రాయంతో మరో ప్రాంతానికి వెళ్లి పరదేశి అయినవాడే!

ఆ యింటికి ఎదురుగా ఒక పాడు బడిన బావివుంది. ఒక చింతచెట్టు వుంది. వానకు తడిసి కరిగి ఆ మట్టి గోడలు ఎత్తు - పల్లాలయ్యాయి. ఆ గోడల నెర్రలలో నుంచి వర్షపు నీరు ధారాళంగా యింట్లోకి ప్రవహిస్తూ వుంటుంది. ఆనీరు యింట్లో నుంచి గడప క్రిందగా ప్రవహిస్తున్న కారణంగా గడప క్రింద ఒక పెద్ద గొయ్యి ఏర్పడివుంది. ఆ గొయ్యి నీటిప్రవాహంతో క్రమంగా పెద్ద గుంట రూపం దాల్చింది. అందులో నుంచి పెద్దపెద్ద జంతువులు, కుక్కలు సులభంగా, నిరాఘాటంగా యింటి లోనికి ప్రవేశింపవచ్చు. ఇంటిలోని నేల ఎగుడు-దిగుడుగా వుంది. ఆ నేలపైన పడుకోవడం అసంభవం - కనీసం మంచం కూడా నిలవదు. రెండో దిశలో ఒక వరండా, దానిని అంటుకొని ఒక గది. ఆ యింటిలో చేరాడు బిల్లేసురుడు. గడప క్రిందవున్న గొయ్యిని మట్టితో పూడ్చివేశాడు. తీరికవేళల్లో కొద్దికొద్దిగా ఆ యింటికి మరమ్మత్తు చేసుకుంటూనేవున్నాడు.

బిల్లేసురుడు ఒక పూట వంటచేసుకొని రెండు పూటలా ఆరగించేవాడు. ఇలా ఒక సంవత్సరం గడిచింది. అతని లక్ష్యంతో పాటు పనిభారం కూడా పెరిగింది. కాని అవరోధాలను మాత్రం అతను ధైర్యంగా ఎదుర్కొనేవాడు. వాటితో ఏమాత్రం రాజీపడేవాడు కాదు. ఆ గ్రామంలో ఎంతోమంది నివసిస్తు

న్నారు. అయితే తనవాడంటూ అతనికి ఎవరూలేరు. శత్రువు దుర్గంలో నివసిస్తున్నట్లు తోచేది అతనికి. అతని అన్నదమ్ములు కూడా అతని పక్షానలేరు, బిల్లేసురుడు తీరిక సమయాల్లో తనను తానే ప్రశ్నించుకునేవాడు. అంతా ఒకే గ్రామంలో ఒక కుటుంబంలాగా నివసిస్తున్నాం. తన తోటి మానవునికి ఎవరూ ఎందుకు సహాయపడడు? కానీ ఈ ప్రశ్నకు అతనికి జవాబు లభించేది కాదు. బహుశా అతను ఈ ప్రపంచపోకడను సరిగా అర్థంచేసుకోగలిగాడేమో! అయినా బొందిలో ప్రాణం వున్నంత వరకు శ్రమించాల్సి వుంటుంది కదా! యితరులకు సహాయపడవలసి వస్తుంది. ఇతరులతో సహకారం పొందాల్సి వుంటుంది. ఈ మాట అక్షరాలా నిజం! అయినా ఎవరు ఈ పరిస్థితిని గురించి ఆలోచించడంలేదు. ఈ బలహీనత దూరమయ్యే నమ్మకం కూడాలేదు. ఈ మన సోక్రటీసుకు నోరులేదు. ఇతని ఫిలాసఫీలో సత్తా లేదు. ఇతని వేదాంతం వినేవాడులేడు. ఆ వ్యూహం నుండి బయటపడే మార్గం అతనికి తెలియదు. అందుచేతనే అతను అయోమయంలో పడ్డాడు.

మరికొంతకాలం గడిచింది. బిల్లేసురుడు కొన్న మేకల రెండు తరాలతో యిల్లంతా నిండి పోయింది. కొన్ని మేక పిల్లలను అమ్మి బాగా డబ్బుచేసుకున్నాడు. గ్రామస్థులు అతని మంచి స్థితికి మరీ అసూయపడ్డారు. ఒకసారి గ్రామస్థులంతా జమీందారు యింటికి వెళ్ళి బిల్లేసురుని మేకలు గ్రామపొలిమేరలలోని చెట్ల ఆకులన్నీ మేసి మోడులను చేశాయని, కాన అతని మేకలన్నింటిని అమ్మించే ఏర్పాటు చేయవలసినదని ఫిర్యాదు చేశారు. జమీందారు ఆలాగే అని వారిని సంతృప్తి పరచి పంపాడేగానీ అతని మీద ఏలాంటి చర్య తీసుకోవడం జరుగలేదు. నిజానికి జమీందారు యింతకు పూర్వమే బిల్లేసురుడి మేకలు చెట్లనన్నింటిని మేస్తున్నాయని బెదిరించి అతనివద్ద నుండి కొంతమొత్తం వసూలుచేశాడు. గ్రామస్థులు అతనితో పగసాధించే నెపంతో అతన్ని 'బకరిహ' అనగా గొల్లవాడని పిలిచేవారు. అతడు ప్రతీకారంగా తన మేకలకు గ్రామస్థుల పేర్లు పెట్టి పిలిచేవాడు.

## తొమ్మిది

బిల్లేసురుడు స్నానంచేసి వంట వండుకున్నాడు. రాత్రికి కొంత అట్టి పెట్టుకొని భోజనంచేసి మేకలను తోలుకుంటూ బయలుదేరాడు. అతని భుజాన

దోటి, కొక్కెం వ్రేలాడు తున్నాయి. నేరేడు పండ్లు చెట్లల్లో బాగామాగివున్నాయి. ఒక కొమ్మకు దోటి తగిలించి లాగాడు. దోటికి ఒకవైపున కొడవలి, మరో వైపు కొక్కెము కట్టివున్నాయి. పండిన పండ్లు జలజల రాలి కిందబడ్డాయి. పండ్లు ఏరుకొని కండువాలో మూటకట్టుకున్నాడు. పండ్లు తింటూ సందుదారిలో చేరాడు. మహావీరమందిరం అరుగుఎక్కి నోటిలోవున్న పండ్ల గింజలు వూసి వేశాడు. మహావీరుని పాదాలు స్పర్శించి ప్రార్థించాడు - "స్వామి! నా మేక లను రక్షించే భారం నీదే!" అతనిలో తులసీదాసు అంతరదృష్టిలేదు. వున్నట్లయితే మహావీరుని దర్శించేవాడే! ఆ విగ్రహం మందహాసం చేసింది త్వర త్వరగా పాదస్పర్శచేసి మేకల రక్షణ బాధ్యత ఆ మహావీరుడికి అప్పగించి మందిరం అరుగుమీద నుండి క్రిందికి దిగాడు. మేకలను అదిలించుకుంటూ సందుదారి గుండా తోటవైపు వెళ్లాడు.

మధ్యాహ్నసమయం. వానచినుకులు పడివున్నాయి. కాబట్టి భూమినెమ్మగా వుంది. వంకలు, వాగులు, గుంతలు, చెరువులు దాదాపు నిండివున్నాయి. ప్రత్తి, వరి, జొన్న, సజ్జ, కందులు, అలసందలు, దోస, మొక్కజొన్న. ఉద్దులు, జనుము, పంటలు వేయాలనే పేరాశతో రైతులు వేగంగా మడక దున్నుతున్నారు. వ్యవసాయ తంత్రాన్ని బాగా వంటపట్టించుకున్న బిల్లేసురుడు వర్షాకాలపు మట్టి వాసనకు మత్తై కొత్త పంట ఏదైనా పండించాలని బుర్రకు పదును పెడుతూ మేకలు తోలుకుంటూ వెళ్లుతున్నాడు. ఆ పొలాలో ఒకచోట అతను కొంత పొలం కౌలుకు తీసుకుని వున్నాడు. వర్షాధారంతో పండే పంటలకు ఎక్కువగా శ్రమించాల్సిన పనివుండదు. విత్తనాలు చల్ల వలసివుంటుంది. ఆతర్వాత పడే వర్షాలతో పంట పండుతుంది. అతనికి ఎద్దులులేవు. పొలం దున్నేందుకు - విత్తనం వేసేందుకు ఎవరిని సానుభూతితో అడిగినా వారు ఎద్దులు యివ్వరు. ఆకారణంగా బిల్లేసురుడు వారం దినాల్లో ప్రస్తుతం పంటవేయ వలసిన పొలాన్ని మాత్రం స్వయంగా పారతో త్రవ్వాలని నిశ్చయించు కున్నాడు.

ఆ గ్రామస్థులంతా రక రకాల పంటలువేస్తారు, పండిస్తారు, కానీ గెనుసు గడ్డలు మాత్రం పండించరు. ఈ పంటతో మంచిలాభం పొందవచ్చు. తర్వాత శ్రావణ మాసంలో మళ్లీ అదే పొలంలో బటానీలు పండించవచ్చు. గెనుసుగడ్డ వేస్తే రాత్రిల్లో కాపలా వుంచవలసి వస్తుంది. అంతో యింతో ముట్టచెప్పి ఏదో ఏర్పాటు చేసుకోవచ్చు. ఒక మంచి మొత్తం చేతికి అందుతుంది.

ఈ ఆలోచనల నుండి వాస్తవిక ప్రపంచంలో ప్రవేశించి చూడగా అతను

చాలా దూరం సాగి వచ్చినట్లు తెలుసుకున్నాడు. ఏదో లోపల భయంతో మేకలను లెక్కబెట్టుకోవాలనే అభిప్రాయంతో ఒకసారి తేరిపార జూచాడు. వాటిపేర్లు పెట్టి పిలిచాడు - గంగా, యమున, సరయూ, పార్వతి, శేఖా యిన్, జమీర్, గులబియా, సితబియా, రముఆ, శ్యాముఆ, భగవతియా, పర భుఆ, టురయీ, అన్నీవున్నాయి. మరి దినవా?

బిల్లేసురుడు ఉలిక్కిపడి అటు యిటు చూశాడు. వెనుదిరిగి కనుచూపు మేర దృష్టి ప్రసారించి కలయ చూశాడు. దీనానాథ్ అనే మేకపోతు జాడ లేదు. అతని గుండె వేగంగా కొట్టు కొంటోంది. వాస్తవంగా అన్ని మేకలలోను దీనానాథ్ చాలా బలిష్ఠమైన మేక పోతు అది వెనకబడి పోయింది. గళమెత్తి పిలచాడు. "ఉర్ర్ర్ర్ - ఉర్ర్ర్ర్ ! దినవా రా! ఉర్ర్ర్! రా! దినవా! రా! నాయనా దీనానాథ్! ఉర్ర్ర్ర్!" ఈలోగా 'టురయీ' మే, మే అని అరుస్తూ బిల్లేసురుడి దగ్గర చేరింది. దీనానాథ్ మేకపోతు కదలికలు ఎక్కడా కన్పిం చలేదు. కుర్రవాళ్లంతా ఆ కాలువ దగ్గర పశువులు మేపుకుంటున్నారు. బిల్లే సురుని చూచి వాళ్లంతా పరిహాసంగా నవ్వారు. బిల్లేసురుని హృదయం బాధతో కుతకుత లాడుతోంది. కుర్రవాళ్ల పరిహాసంతో అతని క్రోధం పెల్లుబికింది. అయినా తనక్రోధాన్ని దిగమింగి - "అరెబాబు! నామేక యిటు రావడం చూచావా?" అని అడిగాడు.

"ఏమేక?"

"ఒక బలిష్ఠమైన మేకపోతు. నేను 'దినవా' అని పిలుస్తుంటానులే!"

"'దినవా' అని పిలిచేపక్షంలో దినవానే అడుగు అది ఎక్కడి కెళ్లిందో మాకెలా తెలుస్తుంది?"

బిల్లేసురుడికి సందేహం కలిగింది, కాలువగట్టు కెళ్లి వెదకాలనుకున్నాడు. కానీ ఈ మేకలన్నిటిని ఎవరిని నమ్మి వదలిపోవాలి? మరొక మేకను మాయం చేస్తే ఏంచేసేది! యిలా ఆలోచించి మరుక్షణమే మేకలను తరుము కుంటూ యింటి దారిపట్టాడు. దారిలో ఒకరిద్దరు కనపడి - "బిల్లేసురా! ఈరోజు యీ వేళకే యింటిదారి పట్టావేమిటి! మేకల్ని యిలా ఎందుకు పరుగెత్తిస్తున్నావు? అని ప్రశ్నించారు.

"తమ్ముడూ! ఒక మేకపోతును ఎవడో దొంగిలించాడు. కాలువగట్టున పశువుల మేపుకుంటున్న కుర్ర వాళ్లను అడిగాను, వారేమి సమాధానం చెప్పడంలేదు."

"మన గ్రామంలో ఎలాంటి దొంగలున్నారంటే నట్టింటిలో పడియుండే

వస్తువుల్నికూడా నిర్భయంగా దోచుకుపోతున్నారు. ఎవరితో నైనా చెప్పుకో వాలంటే మానం పోతుంది. అలా అని ఈ వూరు వదలి మరో చోటికి పారి పోలేంగదా!" దారిలో కనబడ్డవాళ్లు వారి గోడు వినిపించుకున్నారు.

బిల్లేసురుకు యింటికెళ్లి తలుపు తెరిచాడు. గదిలో మేక పిల్లలను, మరి వసారాలో మేకలను, మేకపోతులను తోలి తాళంవేశాడు. ఆ తర్వాత చేతిలో కర్ర పుచ్చుకొని దినవాను వెదకేందుకు బయలుదేరాడు.

అక్కడ నుండి దీనానాథుడి యింటి కెళ్లాడు. అతడు యింట్లో లేడని చెప్పారు. నేరుగా కాలువగట్టు దగ్గరకు చేరుకున్నాడు. అక్కడ ఒక యిసుక తిన్నె మీద ఒక కుర్రవాడు కూర్చొని నలుదిశలు పరికించి చూస్తున్నాడు. బిల్లేసురుడికి ఏదో అనుమానం కల్గింది. కాలువవెంట ముందుకు నడిచాడు, ఆ కుర్రవాడు సంకేత సూచకంగా ఒకలాంటి కేకవేశాడు. ఆ దరిదాపులనే మేకపోతు వుండవచ్చునని ఊహించాడు. మరికొంత ముందుకు నడిచాడు. అక్కడ అతనికి పొదరిల్లు కనబడింది. అక్కడే మేకపోతును చంపి పడవేసి వుంటారని నిర్ణయించు కున్నాడు. పొదరిల్లు దగ్గరగా వెళ్లి తొంగిచూచాడు, అక్కడ ఎవరూ లేరు. పొదరింటి లోనికి వెళ్లి పరికించిచూచాడు. ఒకచోట రక్తంతో తడిసినమట్టి కన్పించింది. కానీ అక్కడ మనిషిగానీ, మేకపోతు జాడగానీ లేదు. అతడి ముఖంలో విషాద ఛాయలు అలుముకున్నాయి. హృదయం రోదిస్తోంది. కానీ కళ్లల్లో కన్నీళ్లులేవు. న్యాయమంటూ ఎక్కడాలేదు. అందరు ఉపదేశాలిస్తారు. బావిదగ్గరకెళ్లి కైవారంపైని కూర్చున్నాడు. అతడిలో ఉద్రేకం ఉరకలు వేస్తోంది. మేకపోతు చంపబడింది. కానీ కుర్రవాళ్లు అసంగతి తెలిసి కూడ చెప్పటంలేదు. ఎనిమిది రూపాయలు పెట్టి కొన్నాడు. అతనికి సహా యపడేవారెవరు లేరు. అస్తమిస్తున్న సూర్యుని ఎండ తలమీద పరచుకుం టోంది. అయినా కూడా ఆ వేడి అనుభూతి అతడికి కలుగలేదు.

సాయంత్రం అయింది. మేకలు ఆకలితో వున్నాయి. ఆకులు కోసుక వెళ్దామను కుంటే దోటిలేకపోయె! రాత్రంతా ఆకలితోవుంటాయి. మేత మేయనిచో ఉదయం పాలు పిదకవు. మేకపిల్లలు ఆకలితో అలమటిస్తాయి. చిక్కిపోతాయి కూడా. జబ్బులు రావచ్చు. కొద్దిగా వరి తౌడువుంది. కానీ అన్నిమేకలకు - పిల్లలకు ఎలా సరిపోతుంది! రాత్రికి చెట్టు రెమ్మలు కోసుక రావాలి.

సూర్యుడు అస్తమించాడు. బిల్లేసురుడి కళ్లల్లో సంధ్యాకాలపు నీరసత ఆవరించింది. గాలి 'సాయ్! సాయ్' అంటూ వీస్తోంది. మృత్యుసందేశాన్ని తెలిపేలాగా కాలువ ప్రవహిస్తోంది. రైతులు పొలాలు దున్ని యింటి ముఖం

పట్టారు. పక్షులు తమ గూళ్ల కొమ్మలపైని కూర్చొని కలరవాలు చేస్తున్నాయి. ఆ కలవరంలో భయం తొంగి చూస్తోంది. రాత్రుల్లో మాగూళ్లలో దాగి యున్నమమ్మ అడవిపిల్లిబారి నుండి ఎవరు రక్షిస్తారనే ఆవేదన వుంది.

బిల్లేసురుడు మనస్సును దిట్టం చేసుకుంటూ మరోపనికి తనను తాను ఆయత్తం చేసుకుంటూ యింటి దారి పట్టాడు. మహావీరుని మందిరం కన్పిం చింది. అరుగుమీదకెక్కి ప్రతికూల ప్రదక్షిణ చేసి నిర్లక్ష్యంగా మహావీరుని విగ్రహం ఎదుట నిలబడి సవాలుచేశాడు. "చూడు! నేను దీనుణ్ణి! నిన్ను దీనులపాటి దైవమంటారు. నేను ప్రతిరోజు నా మేకల్ని, వాటి పిల్లల్ని రక్షిం చమని అడిగేందుకు నీవద్దకు వస్తున్నా! నీవు రక్షించగలగావా! చెప్పు!" అతడికి ఏలాంటి జవాబు రాలేదు. మహావీరుని కళ్లల్లో తీక్షణంగాచూచి ఆ విగ్రహం ముఖం మీద కర్రతో గట్టిగాబాదాడు. ఆ మట్టి విగ్రహం తల ఎగిరి దూరాన పడిపోయింది.

## పది

బిల్లేసురుడు దుఃఖాల ఊబిలో కూరుకపోయినా వాటి సవాలును ధైర్యంగా ఎదుర్కొంటు వస్తున్నాడు. అయినా ఒటమిని మాత్రం ఎరుగడు. ఈ రోజుల్లో మహాత్మాగాంధి గారు మేకపాలు త్రాగుతున్నారు. ఆ కారణంగా మేకపాలకు బాగా గిరాకి పెరిగింది. గ్రామాల్లోకూడా ఈ అలవాటు ప్రాకిందేమోమరి. కానీ బిల్లేసురుని కాలంలో ప్రపంచమంతా మేకపాలను ఏవగించుకునేది. రోగులు మాత్రం ఆవుపాలు లేకపోతే మేకపాలను సేవించేవారు. బిల్లేసురుని గ్రామంలో ఆలాంటిరోగులు కరవయ్యారు. బిల్లేసురుడు మేకపాలు అమ్మాలని ప్రయత్నించాడు, కానీ అతనికి కొనుగోలు దారులెవరు కన్పించలేదు, ఇక లాభం లేదనుకొని అతడు మేకపాలతో ఖోవాచేయడం మొదలెట్టాడు. మేక పాలు పలుచగా వుంటాయి. ఖోవాచేయాలంటే వంట చెరకు విపరీతంగా ఖర్చవుతుంది. చాలా సేపు పొయ్యి దగ్గర కూర్చోవాల్సి వుంటుంది. పైగా శ్రమసాధ్యం, కొండను త్రవ్వితే ఎలుకను పట్టిన సామెతలాగా తయారయింది. అతని వ్యవహారం. బర్రెపాలను సేరుకు పావు ఖోవాతయారవుతుంది. మేక పాలకు అందులో సగం కూడా ఖోవా తయారు కాలేదు. భజనలాల్ మిఠాయి దుకాణానికి వెళ్లి ఖోవా కొనమని కోరాడు. అతడు పని వత్తిడిలో ఖోవాను

పరిశీలించి చూడ కుండానే తూచి వెలకట్టి యిచ్చివేశాడు. రెండోరోజు బిల్లే సురుడు ఖోవాతీసుకెళ్లాడు. భజనలాల్ తూకంవేసి వెళ్లిపొమ్మన్నాడు. బిల్లే సురుడు ఖోవా వెలయిమ్మని అడిగాడు. భజనలాల్ కళ్లు ఎర్రచేసి- "నేను బర్రెపాల ఖోవా అనుకొని నిన్నకొన్నాను. మేకపాల ఖోవాకు అందులో సగం ధర మాత్రమే యివ్వాల్సి వుంటుంది. నిన్న యిచ్చిన డబ్బు ఈ రెండు రోజులకు సరి పోయిందిగదా! మేక పాల ఖోవా కొనేనాథుడెవడు లేడు. ఇక నీవు నా దుకాణానికి రావలసిన పనిలేదు. మేకపాల ఖోవాతో చేసిన మిఠాయి పాడవుతోంది. పైగా రుచివుండదు. కోనుగోలు దారులు నానాతిట్లు తిడుతున్నారు. నెయ్యిచేద్దామా అంటే ఏ నెయ్యిలో కలవదాయె! మొత్తం నెయ్యిచెడుతోంది," అంటూ గద్దించి పంపివేశాడు.

బిల్లేసురుడి తల తిరిగి పోయింది. మెల్లగా యిల్లు చేరుకున్నాడు. అత నికి మరో ఉపాయంతోచింది. మేకపాలు కాచి తోడుపెట్టి మరుసటి రోజు పెరుగుచిలికి వెన్నతీశాడు. చల్లచేసి స్వయంగా త్రాగి మేకపిల్లలకు త్రాగిం చేవాడు. వెన్నకాచి నెయ్యిచేసేవాడు, కొద్దిగా బర్రె వెన్నకొని కాచి మేకవెన్నలో కలిపేవాడు. ఆ నెయ్యి బజారులో అమ్మేవాడు. తక్కువ ధరకు సాధారణంగా పల్లెటూళ్లలో ఆవు, బర్రె, మేకల వెన్న కలిపి అమ్ముతారు. అక్కడ పశు వులు రెండు, మూడు రకాలు వుంటాయి. వాటి పాలను వేరు వేరుగా తోడు పెట్టటం జరగదు, బిల్లేసురుడి వ్యాపారంసాగింది. మేకపోతు చనిపోయిన కారణంగా కల్గిన లాభ - నష్టాలు, జీవన-మరణ వేదాంతాన్ని బేరీజువేసు కొని భవిష్యత్తుని గురించి ఆలోచించాడు. మేకలను మేతకుమైదానంలోనికి తీసుకవెళ్లకుండా యింటి వద్దనేమేపాలని నిశ్చయించుకున్నాడు. పొలంపని పూర్తిచేసి గెనుసుగడ్డలు పండినంతవరకు యీపద్ధతినే అనుసరించాలనుకున్నాడు.

తెల్లవారగానే పారతో పొలం చేరుకున్నాడు. రాత్రికి మేకలకు కావలసి నన్ని ఆకులు కోసుకొని వచ్చాడు. ఆ రోజంతా ఆ మేత సరిపోతుంది. అతను పొలం త్రవ్వుతుండగా చూచి గ్రామస్థులు అతన్ని అపహాస్యంచేశారు. కానీ బిల్లేసురుడు మారు మాట్లాడక తన పనిలో తాను లీనమైనాడు, మధ్యాహ్నానికి చాలా పొలం త్రవ్వగలిగాడు. అది చూచి అతని కడుపు చల్లబడింది. వారం దినాల్లో తన పరిశ్రమతో మేకపోతు నష్టాన్ని పూరించుకోగలననే ధీమా గల్గింది అతనికి. మధ్యాహ్నవేళ యింటికొచ్చి లస్సీ త్రాగాడు, కొద్దిసేపు విశ్రాంతి తీసుకొని మళ్లీ పొలానికి వెళ్లాడు. సాయం కాలం వరకు పొలం త్రవ్వి మేకలకు ఆకులు కోసుకొని రాత్రికి యిల్లుచేరాడు.

వారం రోజులపని ఐదు దినాల్లో పూర్తిచేసి గట్లు కట్టడం మొదలెట్టాడు. గ్రామస్థులంతా బిల్లేసురుని ఏలాంటి పైరు పెడుతున్నావని అడిగారు. బిల్లే సురుడు భంగి ఫండిస్తానని బదులు చెప్పేవాడు. గ్రామీణులు సాధారణంగా తన మనసులోని మర్మాన్ని విప్పిచెప్పరు. బిల్లేసురుడు నాలుగైదు గ్రామాల్లో విచారించి గెనుసుగడ్డ అంట్లు తెచ్చాడు. ఒకానొకనాడు బిల్లేసురుడు తన పొలంలో గెనుసుగడ్డ అంట్లు పెడుతుండగా గ్రామస్థులంతా చూచారు. వర్షం కురిశాక అతడు గెనుసు తీగలు అల్లుకునేందుకు గట్లు కడుతున్నట్లు చూచి విస్తుపోయారు.

# పదకొండు

త్రిలోచనుడి ఎద్దులను కొనడం మాని బిల్లేసురుడు మేకలు కొన్నాడు. ఆ నాటి నుండి త్రిలోచనుడు బిల్లేసురుని మీద పగ సాధిస్తున్నాడు. మేకల మంద పెరిగింది. గ్రామంలోని ధనవంతుల సూచికలో బిల్లేసురుడి పేరు చేరింది. ప్రజలు అతని గురించి పలు విధంగా మాట్లాడడం ఆరంభించారు.

అది కార్తీక మాసం. బిల్లేసురుని గెనుసుతీగలు పచ్చ పచ్చగా రెపరెపలాడు తున్నాయి. అంతా రకరకాలగా ఆ పంట ఆదాయాన్ని లెక్కగడుతున్నారు. ఎన్ని మణుగులు పంటవస్తుందో ఊహాగానం చేస్తున్నారు. బిల్లేసురుడు మేక పాలలో పేలాల పిండి కలుపుకొని భోజనం చేస్తున్నాడు. త్రిలోచనుడు అతన్ని పలకరిద్దామని వచ్చాడు. మేక పిల్లలను కప్పేందుకు ఒక మూసిన గంప వుంది. త్రిలోచనుడు గంప మీద కూర్చోవాలని ప్రయత్నం చేశాడు, కాని బిల్లేసురుడు చేతి సైగతో కూర్చో వద్దని తెల్పాడు. త్రిలోచనుడు మారు మాట్లాడకుండా నేల మీద కూర్చున్నాడు. మందహాసంచేసి "చాలా మంచి కబురు బిల్లేసుర్" అన్నాడు. ఉపదేష్టముద్రలో బిల్లేసురుడు కొద్దిసేపు ఆగవలసినదనే భావంతో సంజ్ఞచేశాడు.

"భోజన సమయంలో నీవు మాట్టాడవా!" త్రిలోచనుడు అడిగాడు.

గంభీర భావంతో కళ్లుమూసుకొని నకారాత్మరంగా తల ఆడిస్తూ బిల్లే సురుడు ప్రత్యుత్తరమిచ్చాడు.

త్రిలోచనుడు తన వార్తాలాపం ఏలా మొదలెట్టాలో మనసులో గుణిం చుకుంటున్నాడు.

బిల్లేసురుడు త్వరగా భోజనం ముగించి లేచాడు. జలదారి వద్ద కూర్చొని చేతులు కడుక్కున్నాడు. పుక్కిలించి అలవాటు ప్రకారం జందానికి కట్టి వున్న రాగి పల్ల కుట్టుడు పుల్లతో పళ్లు శుభ్రం చేసుకున్నాడు. మళ్లీ పుక్కిలించి త్రేన్చాడు. ఆ తర్వాత తలవంచి గదిలో ప్రవేశించాడు. త్రిలోచనుడు ఈ తతంగమంతా గమనిస్తూనే వున్నాడు. బిల్లేసురుడు ఒక మంచం తెచ్చి ఆరు బయట వేశాడు. అప్పుడన్నాడు "రావయ్యా! కొంచెం జాగ్రత్తగా కూర్చో! అటు యిటు కదలకు." త్రిలోచనుడు లేచి మంచం మీద ఒక వైపుగా కూర్చున్నాడు. బిల్లేసురుడు మరో ప్రక్క కూర్చున్నాడు. త్రిలోచనుడు సాలోచనగా బిల్లేసురుణ్ణి చూచి విస్ఫారిత నేత్రాలతో ఆశ్చర్యంగా యిలా అన్నాడు.

"నీవు పెళ్లిచేసుకోదలిస్తే ఒక మంచి సంబంధంవుంది!"

వివాహం పేరు విన్నంత మా త్రాన్నే బిల్లేసురుడి నరాలలో విద్యుత్ ప్రవాహం జరిగినట్లయింది. కానీ హిందూ మతానుసారంగా ఆ బాంధవ్యాన్ని ఉపయోగితా వాదానికి జోడిస్తూ అన్నాడు. "నీవు ప్రత్యక్షంగా చూస్తున్నావు కదా! నేను పేలపిండి తింటున్నాను. అదే భార్య అంటూ ఒక స్త్రీ వుంటే మరణావస్థలో వుండి కూడా యింత భోజనం చేసిపెట్టేది కదా?"

"అక్షరాలా నిజం!" త్రిలోచనుడు తాళం వేశాడు. బిల్లేసురునికి కొంత ప్రోత్సాహం లభించింది. ఆత్మీయతా భావంతో అన్నాడు - "ఈ గ్రామంలో వెనుక-ముందు అంటూ నలుగురు అన్నదమ్ములున్నారు. ఆ వ్యామోహంలోనే యిక్కడ పడియున్నాను. అలా కాకపోతే చనిపోయేందుకు ప్రపంచంలో ఎక్కడా నాకు చోటులేక కాదు!"

"ఈ మాట కూడా నీవే తెలియజెప్పాలి!"

బిల్లేసురుని పౌరుషం మేల్కొంది "బెంగాలు వెళ్లివచ్చా, నీకు తెలియనిదేమీ లేదు. అక్కడ నేను కావాలనుకుంటే ఒకామెను ఉంచుకోగల్గివుండే వాణ్ణి. కాని వంశ ప్రతిష్ఠ అంటూ ఒకటి ఏడ్చి చచ్చింది గదా! తాత - ముత్తాతల పేరు మట్టిలో కలసి పోతుందిగదా! ఆ కళంకాన్ని కొని తెచ్చుకో దలచుకోలేదు. ఆలా చేసివుంటే మీరంతా కూడా బిల్లేసురుడు వాళ్ల నాన్నకు పుట్టి, ఆయనకు చెడ్డపేరు తెచ్చాడని ప్రచారం చేసి ఉండే వారు కదా?"

"గ్రామస్థులంతా నిన్ను మెచ్చుకుంటున్నారు, బిల్లేసురుడు సరైన మగాడంటున్నారు." త్రిలోచనుడు అన్నాడు.

"పేరు ప్రతిష్ఠల కొరకే ఈ ప్రపంచమంతా ప్రాకులాడుతుంది. నేనెందుకు యింత కష్టపడుతున్నానను కుంటున్నావు? పేరు లేక పెన్నిధి లేదం

టారు! మా తండ్రి చనిపోయి కూడా జీవించివున్నాడు. ఎందుకు! మేమంతా వున్నందుకే కదా? మరి ఆయనకు మనమడు అంటూ లేకపోతే!"

"నీలాంటి బుద్ధిమంతుని కన్న తండ్రికి మనమడు ఏలా లేకుండా పోతాడు?"

"తల్లి - దండ్రులే ప్రపంచంలో నిజమైన దేవతలు. ధర్మమే లేకపోతే తల్లి - దండ్రులు వుండే వారు కాదు."

"నిస్సందేహంగా ప్రతి ఒక్కరు ధర్మాన్ని పాటించాలి. అందుచేతనే ధర్మంకొరకు ప్రాణత్యాగం చేయవలయునని ఆర్యోక్తి కల్గింది."

"ఇప్పుడు నా విషయమే ఆలోచిద్దాం పొలంపనికెళ్లి యిల్లు చేరుకున్నాను. యింట్లో ఆడదిక్కులేదు. స్త్రీ లేకుండా ఒక క్రమపద్ధతిలో భోజనం తయారు కాదు. హడావిడిగా స్నానంచెయ్యడం, వంట వండుకోవటం, తినాడానికి కూడా వీలుపడదు. ఇక ధర్మం అంటూ ఎక్కడ వుంది?" బిల్లేసురుడు ఉత్తేజం పొంది అన్నాడు.

"మేమీ ధర్మాన్ని ఎప్పుడో తెలుసుకున్నాం. ఇక నీవే తెలుసుకోవాల్సి వుంటుంది."

బిల్లేసురుడు త్రిలోచనుని కళ్లలో ఒక పర్యాయం ప్రశ్నార్థకంగా చూచి మనసులో అనుకున్నాడు. "ఇతడు దలారీ పనిచేయటానికి వచ్చాడు. ప్రపంచంలో తానే గొప్పమేధావి అనుకుంటున్నాడు. ఇక డబ్బు ప్రస్తావన తెస్తాడు. ఎవరి పిల్లో, ఏమో? యిందులో ఏదో తిరకాటం వుంది. మోసమూవుంది. వచ్చిన చిక్కు ఏమిటంటే - నిర్వాహంకావటంలేదు. ఆకలి వేస్తుంది. కాన తినవలసి వస్తోంది. వర్షం పడుతుంది, ఎండ కాస్తుంది, వడగాలి వీస్తుంది. ఆ కారణంగా యింటిలో నివసించవలసి వస్తోంది. తల దాచుకోవాల్సివస్తోంది. ఇంటి రక్షణకు పెళ్లి అవసరం. ఇంటి పనులన్నీ స్త్రీ నిర్వహిస్తుంది. మానవ సమాజం రకరకాల వస్తు సముదాయంతో తమ యిల్లు నింపుకుంటారు. అలంకరించుకుంటారు. స్త్రీకి నగ - నట్ర తయారు చేయిస్తారు. ఈలాగా యిదంతా జంజాటమే మరి. అయితే ఈ గృహస్థ జీవితంలోను ఎన్నో బాధలున్నాయి, కంతలున్నాయి మరి!" ఇలా ఆలోచిస్తుండగా అతనికి గురుపత్ని స్మృతి పథంలో మెరిసింది. ఆ గ్రామంలోని ప్రతి యింటి శూన్యచరిత్ర అతని కళ్ల ముందు ప్రత్యక్షమయింది. ఇంత వరకు అతను అబద్ధాలు చెపుతూ వచ్చాడు. అందుకేగామరి ఆలాంటి వారి వలలో బుల్ బుల్ పిట్టలు పడిపోతుంటాయి. త్రిలోచనుడు చాలా తెలివిగా మాట్లాడగలడు. బిల్లేసురుడు ఒక పర్యాయం ఆలోచించాడు. అతని అభిప్రాయమేమిటో తెలుసు కుందాం. అందువల్ల

కలిగే నష్టం అంటూ ఏమీ లేదు. ఇలా ఆలోచించి కరుణ ఉట్టిపడే కంఠంతో అన్నాడు "అవును అన్నా! గ్రామస్థులంతా నిన్ను చాలా మేధావిగా కొనియాడుతూవుంటారు."

త్రిలోచనుడు సంతోషించి అన్నాడు. "యౌవనం పొంగులోవున్న షోడషి మన గ్రామానికి యింత వరకు రాలేదు సుమా? నామాట నమ్ము!" బిల్లేసురునికి దేవతలు మెదలో మెరిశారు.

"నీ చూపు ఎన్నడైనా మోసపోతుందా! ఏ వూరు ఆ అమ్మాయిది!" బిల్లేసురుడు ఉత్సాహంగా ప్రశ్నించాడు.

"ఈ సంగతి మాత్రం చెప్పను. నీవు పెళ్లాడడానికి వెళ్తావుకదా! అప్పుడే తెలుసుకుంటావుమరి!"

"కట్నాలు-కానుకల మాటేమిటి? వీటి అవసరం లేదంటావా?"

"లేకేమి? కానీ ఖచ్చితంగా యింత మొత్తం యివ్వాలని పట్టింపులు లేవు. తివారీల కుటుంబం పిల్ల. అన్ని వ్యవహారాలు నేను చూసుకుంటానుగా మరి, నీకేమీ భయం అక్కర్లేదు."

"ఏ గ్రామం పిల్ల."

"ఆ విషయం యిప్పుడే చెప్పానంటే యిక అందులో సారస్యం అంటూ ఏముంటుంది? పెండ్లికంటే ముందుగానే నీకు తెలుస్తుంది కదా! మరోమాట, అక్కడ పెళ్లిఖర్చంటూ ఏమీ లేదు చాలా పెద్ద మనుషులు. అమ్మాయిని అమ్ముకోరు. కాని ఖర్చు నీవేభరించాలి!"

"ఏమాత్రం?"

త్రిలోచనుడు లెక్కగట్టాడు. ఆ తర్వాత నిర్మొహమాటంగా అన్నాడు- "మీ యింటికి అమ్మాయి పెళ్ళివారు వస్తారు. అయితే వాళ్లు మా ఇంట్లో బస చేస్తారు. పళ్లెంలో ఏడురూపాయలు, కొబ్బరి కాయతో పాటు ఒక తాను ఉంచుతారు. ఈ సాంగ్యంలో మొత్తం 20 రూపాయలు ఖర్చువుతుంది. ఈ మొత్తము డబ్బు ఒక వారం రోజులు ముందుగా నీవు యిచ్చుకో వలసి వుంటుంది. అనంతరం 150 రూపాయలు వివాహపు ఖర్చులకు యివ్వాలి. ఈ డబ్బంతా నీవు నా చేతుల ద్వారానే చెల్లించాల్సి వుంటుంది. వాళ్లు మంచి సంప్రదాయం గల కుటుంబస్థులు, నీ ఎదుట చేతులు చాచి డబ్బు ఏలా తీసుకోగలరు? పెండ్లి తంతులకన్నిటికి కలసి నూట ఏబదిరూపాయలు పప్పులో ఉప్పుకు కూడా సమానం కావు. నీ స్థోమతను కూడా చూడాలి గదా మరి! కులంలో నీ కంటే పెద్దవారే మరి!"

"కులంలో గొప్పవాళ్లయితే ఆపెండ్లి ఫలించదు, మన్ను వాజపేయి డబ్బు లేక తక్కువ వంశంలో పెళ్లి చేశాడు. అతని కుమార్తెకు వైధవ్యం సంప్రాప్తించింది. తన ప్రియుడి సలహా పాటించి భర్తకు విషం తినిపించింది. అతడు కొద్ది రోజులుగా జబ్బుతో వున్నాడు. చికిత్స జరుగుతూనే వుంది."

నా మీద కూడా ఆలాంటి ప్రయోగం జరిగితే? "బిల్లేసురుడు సందేహం వ్యక్తం చేశాడు.

"నీవే మాత్రం భయపడనవసరం లేదు. నా మాటనమ్ము. అమ్మాయిలో ఏలాంటి లోటులేదు. ఆమె ప్రవర్తన మంచిది. కుంటి, గుడ్డి, కురూపి కూడా కాదు."

నీ మాట మీద నాకు నమ్మకంలేక కాదు. ఏమి వివరాలు తెలుసుకోకుండా వివాహానికి పదిరోజులు ముందుగా యింటికి చేరే బంధువర్గానికి నేనేమి జవాబు చెప్పాలి? త్రిలోచన అన్నయ్యకు అన్ని వివరాలు తెలుసునని కూడా వారికి నేను సమాధానం చెప్పలేను. పైగా జాతకము చూపించుకోవాలి గదా! ఆ అమ్మాయి జాతకం తీసుకురా! నేను నా సమక్షంలోనే వివరాలు తెలుసుకుంటాను. అమ్మాయిలో ఏదైనా దోషము వున్నట్లయితే కుక్క చావు చావాలి! అన్ని రకాల మంచి చెడ్డలు విచారించి కదా కళ్యాణం చేసుకోవాలి!"

త్రిలోచనుడికి మహా చెడ్డ కోపం వచ్చింది. "బిల్లేసుర్! నీయింటి ఛాయలకు ఎవడూ పిల్లనిస్తాననిరాడు. ఏదోవిధంగా నిన్ను ఒక యింటివాణ్ణి చేయాలని నానా తంటాలు పడుతూవుంటే దయతలిచి ప్రయత్నంచేశా! బాగా ఆలోచించు. నీలోనే జాతకదోషం వుంటే? ఏ తండ్రి తన పిల్లను నీకు కట్టబెడతాడు? బంధువులు చుట్టాల మాటంటావా? యిదంతా మూర్ఖత్వమంటాను. నేను వాళ్లను పదిరోజులు యింట్లో కూర్చోబెట్టి మేపాలి. నామాటవిను! నీవు ఒక్కడివే వెళ్లి పెళ్లి చేసుకొనిరా! అమ్మాయి తండ్రి పేరు తెలుసుకోవాలనుకుంటే వెళ్లి వాళ్ల యిల్లు - వాకిలి చూచిరా! కాని నీవు వెళ్లడం మంచిది కాదు, ఊరంతా నవ్వుతుంది."

బిల్లేసురునికి త్రిలోచనుని మాటల్లో కొంత నమ్మకం కల్గింది. కానీ డబ్బు విషయంలో కొంత అనుమానం లేక పోలేదు. అమ్మాయి అందం కూడా అతనిపై ప్రభావం చూపుతోంది. త్రిలోచనుని పూర్తిగా నమ్మలేక పోతున్నాడు. మెల్లిగా ఆరాతీయాలని అడిగాడు.

"యిక్కడికి ఎంత దూరం వుండవచ్చు?"

"మూడు - నాలుగు కోసులుంటుంది!"

బిల్లేసురుడు ఆలోచించాడు. ఒకేరోజులో వెళ్లిరావచ్చు. మేకలకు కూడా అంత కష్టం వుండదు. ఆకులు కోసివేస్తే నమలుతూవుంటాయి.

"అన్నా! అలాయితే పద చూచి వస్తాం! నీవే నిశ్చయించు! తయారవుదాం!"

త్రిలోచనుడు తన స్వార్థాన్ని ఆలోచించుకొని, "నాలుగో రోజున తప్పక వెళ్లాము," అన్నాడు.

## పంద్రెండు

బిల్లేసురుడు ఆ రాత్రి నిద్రపోలేదు. అదేరూపాన్ని చూస్తూ వున్నాడు. చాలా తెల్లగావుంటుంది. యిలా ఆలోచిస్తూ వుండగా అతనికి రామరతన్ భార్య మదిలో మెదిలింది. ఆమె 16 సంవత్సరాల పడచు. అనగానే అతని కళ్ళ ఎదుట రామరతన్ సుకుల్ కుమార్తె స్వరూపం ప్రత్యక్షమైంది. పుఖరాజ బాయి కుమార్తె హసీన కళ్లలాగా ఆమె నేత్రాలు విశాలంగా వుంటాయి. ఆ అమ్మాయి గృహిణిగా యింట్లో ప్రవేశిస్తే అయింటికీ ఒక క్రొత్త వెలుగు వచ్చినట్లే కదా! మేకపిల్లల గదిలో ఆ గృహిణి సామానులు సర్దవచ్చు, మేకపిల్లలకు వసారాలో ఏర్పాటు చేయవచ్చు. ఇంటి ముందు ఒక పందిరి వేసుకుంటే హాయిగా వుంటుంది.

కాని మేకల పెంటికల వాసనను భరిస్తూ ఆలాంటి యువతి ఆ యింటిలో ఒకరోజైనా వుండగలుగుతుందా? అని బిల్లేసురుడు ఊహించలేకపోయాడు.

ఉదయం నిద్ర లేవగానే గ్రామంలోని బట్టల వ్యాపారి దుకాణానికి వెళ్లి చొక్కాకు బట్ట, గులాబీరంగు రుమాల, ఒక పంచకొన్నాడు. దర్జీ యింటికి వెళ్లి చొక్కాకు కొలత యిచ్చాడు. ఆరోజు సాయంత్రానికి కుట్టి యివ్వమని చెప్పాడు. గ్రామంలోని చర్మకారుని వద్ద చెప్పులు కొన్నాడు.

ఒకవైపు ఈ ప్రయత్నాలన్నీ చేస్తూనే మరో వైపు త్రిలోచనుడి మీద ఒక కన్ను వేసి వుంచాడు. మూడో రోజున త్రిలోచనుడు యింటి నుండి బయలుదేరాడు. అతడి వేష-భూష, చేతిలో కర్ర చూచి 'పెండ్లి కార్యం సాధించుకునేందుకే వెళ్లుతున్నాడని ఊహించాడు. అక్కడి విషయాలు మాట్లాడి వచ్చి అతన్ని తీసుకవెళ్ళతాడని భావించాడు. అతడు వెళ్లే దారిదిశను

చూచి తన మామూలు దుస్తులతో కొంత దూరం అతన్ని వెంబడించాడు. త్రిలోచనుడు తూర్పు దిశలో కచ్చా రాస్తాను వదలి మునుకుతిరిగాడు.

బిల్లేసురుడు తూర్పుదిశన దారి ప్రక్కన నిలబడి గమనించాడు, అతడు గ్రామంలో ప్రవేశించగానే బిల్లేసురుడు కూడా గ్రామంలో అడుగుపెట్టాడు. గ్రామ కంఠంలోనే అతనికి ఒక ఆసామి కన్పించాడు. బిల్లేసురుడు ఆరా తీయాలనే దృష్టితో అడిగాడు ".ఈ ఊరికి శ్యామపుర నివాసి త్రిలోచనుడు వచ్చాడా?"

"ఆ బాబు! అ పగటి మోసగాడు రామనారాయణ యింటిలో కూర్చుని వున్నాడు. వాళ్లిద్దరు ఒకరిని మించిన మరొక దగాకోరులు, ఎవడి గ్గొంతో కోయాలని పన్నాగం పన్నుతున్నారు."

బిల్లేసురుడి గుండె వేగంగా కొట్టుకోసాగింది. "రామనారాయణకు కుమారులు, కుమార్తెలు వున్నారా! ఎంతమంది?" నెమ్మదిగా అడిగాడు బిల్లేసురుడు, అనుమానించని ధోరణిలో.

ఆ పెద్దమనిషి ఉలిక్కిపడి బిల్లేసురుని ఎగాదిగా చూచి వ్యంగ్యంగా అన్నాడు, "నీది ఏవూరు బాబు? రామనారాయణను గురించి నీకు ఏమి తెలియదా? ఆ ముండాకొడుక్కు కొడుకులు - కూతుళ్లుకూడానా? అసలు వాడికి వివాహమంటూ అయివుంటే గదా?"

ఈ మాటలు చెప్పి అతడు తనదారిని వెళ్లిపోయాడు. బిల్లేసురుడు ఆశ్చర్యపడి పోయాడు, అయినా ఏమాత్రం చలించకుండా తనసోదరుడు మన్నీ అత్తగారింటికి వెళ్లాడు. ఆమెతో సుఖ-దుఃఖాలు మాట్లాడాడు. బిల్లేసురుడు ఆమెకు ధైర్యం చెప్పి "నీకు ఖర్చుకుడబ్బు లేకపోతే యింటికివచ్చి తీసుకవెళ్లమని" ఊరట కల్గించాడు. చివరకు ఆమె చేతిలో ఒక రూపాయి వుంచాడు. మన్నీ తన బిడ్డను బాగా చూచుకుంటాడని అతడి పాప బాగా పెరిగిందని చెప్పింది.

మన్నీ అత్త చాలా సంతోషించి రూపాయి పుచ్చుకొంది. ఆ తర్వాత బిల్లేసురునితో పెళ్లి చేసుకున్నావా, నాయనా? అని అడిగింది. బిల్లేసురుడు "తల్లి దండ్రులే తమ పిల్లలను ఒక యింటి వారుగా చేస్తారు! అసలు నాకు దిక్కెవరున్నారు!"

మన్నీ అత్తగారు చలించి "నాయనా? పది పదునైదు రోజుల్లో నేను నీ యింటికి వస్తాను. అప్పుడు పెళ్లిని గూర్చి పక్కాగా మాట్లాడు కుందాం" అన్నది.

బిల్లేసురుడు ఆమెచరణ స్పర్శ చేసి సెలవు తీసుకుని తన గ్రామానికి బయట దేరాడు.

## పదమూడు

త్రిలోచనుడు మరునాడు వచ్చి "బిల్లేసుర్! తయారేనా?" అని అడిగాడు.

"నేను ఎప్పుడో తయారైయున్నా!" బిల్లేసురుడు జవాబిచ్చాడు.

త్రిలోచనుడు చాలా సంతోషంచి. "మరి, ఆలస్యం దేనికి? బయలు దేరు!" అన్నాడు.

"అన్నా! మన్నీ చిన్నత్త అన్న కుమార్తె అత్తగారింట్లో ఒక అమ్మాయి వుంది. నిన్న వాళ్లువచ్చి సంబంధం పక్కాచేసుకవెళ్లారు. నన్ను క్షమించు," బిల్లేసుడు చెప్పాడు.

త్రిలోచనుడు కోపంతో ఉగ్రుడై పోయాడు. "ఆపెళ్లి తప్పక ఆగిపో తుంది. ఆ అమ్మాయి కూడా ఆలాంటిదే అయి వుంటుంది. నేను పందెం వేసి చెప్తున్నా!"

మందహాసంచేస్తూ బిల్లేసురుడు జవాబిచ్చాడు. "నీవు తెచ్చిన సంబంధం అంత పవిత్రమైనదనిచెప్పు కుంటున్నావా? మన్నీ చిన్నత్త అన్నకుమార్తె అత్తగారింటి సంబంధంలో దోషాలున్నాయా? నీవు తెచ్చిన సంబంధ మోమరి? ఆ అమ్మాయి అమ్మ - నాన్న, వూరు, పేరు అంటూ ఏమిలేదాయే, మరి. అంతా అరచేతిలో వైకుంఠం చూపిస్తున్నావు."

"బాగా ఆలోచించుకో! నీవు పశ్చాత్తాపపడతావు!" "నేనెప్పుడు పశ్చా త్తాపడవలసిన పనులేమిచేయను, పదిసార్లు బాగా వెనక - ముందు ఆలోచించి ముందుకు అడుగేస్తాను."

"అమ్మాయిని చూచి మరీ మాట్లాడు. వెళదామా?"

"యిక అమ్మాయిని చూచే ప్రశ్నేలేదు. మా బంధువుల సంబంధం వుండగా నేను కొత్త సంబంధం చూచుకోవలసిన అవసరం ఏముంది? ఒక మంచి గృహస్థుని యింటి అమ్మాయి రూపం కాదు గుణం చూడాలి, అదే ముఖ్యం. అందమైన అమ్మాయి చెడు ప్రవర్తనకలిగి వుంటుందంటారు పెద్దలు."

"ఓహో! నీవు సావిత్రిని తెచ్చుకుంటున్నావా! చూస్తూవుండు ఈ వూరు కోడెల్లాంటి కుర్రాళ్ళ బెడద తప్పించుకోగలవా?"

"అన్నీ తెలుసు! కానీ యింట్లో సామాను దొంగిలించి పారిపోదు కదా! కష్టాలు ఎదుర్కొంటుంది. ఎవరూ ఎవరి ధర్మాన్ని పాడుచేయలేరు, నాకు ఈ గ్రామంలోని అందరి కథలు బాగాతెలుసు."

"నీవు అందరిలో అవగుణాలు వెదకుతున్నావా?" "నీ విక్కడనుండి వెళ్లిపో, కాపలావాణ్ణి పిలవనా?" కాపలావాని మాట వినగానే త్రిలోచనుడు వెళ్లిపోయాడు.

# పద్నాలుగు

కార్తీక మాసం రాగానే మన్నీ అత్త బిల్లేసురుని యిల్లు వెదకు కుంటూ వచ్చింది. దారితప్పినా ఏలాగో యిల్లు చేరింది. బిల్లేసురుడు ఎదురుగా వెళ్లి పాదాభి వందనం చేశాడు. యింటిలోనికి తీసుకవెళ్లి మంచంవేశాడు. మంచం మీద ఒకగోనెపట్ట పరచి "అమ్మా, కూర్చో!" అని ఆప్యాయంగా పలకరించాడు. మంచం మీద కూర్చుంటూ "నీవునిలబడే వుంటావా?" అని ప్రశ్నించింది.

"పిల్లవాళ్లు నిలబడే వుండాలి కదా? మీ కుమార్తెలాగే నన్ను ఒక కుమారుడు అనుకో తల్లి. ఆమె నాకంటె కొద్దిగా పెద్దది వయసులో, మీరేమో నాకు ధర్మ తల్లి అవుతారు గదా! మీరు కూర్చోండి. యిదుగో, నేనిప్పుడే వస్తా," అంటూ బిల్లేసురుడు ఆ గ్రామం కోమటి యింటికి పరుగుతీశాడు. ఒక పావు చక్కెర కొన్నాడు. యింటికి వచ్చి మేక పాలలో చక్కెర కలిపి చెంబు నింపి మంచంమీద వుంచాడు.

ఆ తర్వాత ఒక గ్లాసులో నీళ్లు తెచ్చి - "అమ్మా! మంచనీళ్లు త్రాగి ఆ కుండలో నీళ్లున్నాయి, కాళ్లు చేతులు శుభ్రం చేసుకరండి," అంటూ మంచం మీద వుంచిన పాలచెంబు చేతికి తీసుకున్నాడు. మన్నీ అత్తగారు కాళ్లు - చేతులు శుభ్రం చేసుకొంది. బిల్లేసురుడు గ్లాసులో పాలు పోస్తున్నాడు, ఆమె త్రాగుతోంది. పాలు త్రాగి మన్నీ అత్తగారు ఎంతో సంతృప్తిచెంది "నాయనా! నేను మా ఇంటి వద్దకూడ మేకపాలే త్రాగుతాను, మేకపాలవల్ల ఎన్నో లాభ లున్నాయి. సమస్తరోగాలకు మూలమైన చెడు పదార్థాలను నశింపచేస్తాయి. ఆ పాలను సర్వరోగ నివారిణి అంటేనమ్మా!"

సంధ్యా సమయం. చింత చెట్టు మీద పక్షులు కలరవాలు విన్పిస్తు న్నాయి. బిల్లేసురుడు ఒకసారి ఆకాశంవైపు చూచి అన్నాడు, "ఇంకా సూర్యా

స్తమయానికి కొంత సమయంవుంది. అమ్మా, నీవు కూర్చో! నేనిప్పుడే వస్తాను. నీవు మేకలను ఒక కంటకనిపెట్టి వుండు. ఇంటిలోపల గొళ్లెం పెట్టి విశ్రాంతి తీసుకో, నేనొచ్చిన తర్వాత కేకవేస్తాను. అప్పుడు నీవు తలుపు తెరువు. ఈ వూళ్లో మేకల దొంగలున్నారు," అని చెప్పి బిల్లేసురుడు బయలుదేరాడు. మన్నీ అత్తగారు యింటిలోపల తలుపుమూసి గొళ్లెంపెట్టింది.

బిల్లేసురుడు పొలాలు దాటుకుంటూ రామగులాం తోటకెళ్లాడు, అతడింకా తోటలోనే వున్నాడు, బిల్లేసురుని చూడగానే 'ఏమిటి సమాచారం' అని పలకరించాడు. కూరగాయలకు వచ్చానని బదులు చెప్పాడు. రామగులాం వంకాయలు, కాకరకాయలు వున్నాయి, ఏవికావాలి? ఎంత కావాలని అడిగాడు. "ఒక సేరు లేత వంకాయలు యివ్వుబాబు!" అంటూ బిల్లేసురుడు కూరగాయల పొదులుచూస్తూ వుండి పోయాడు - రామగులాం వంకాయలు తెంచి తూచాడు. వంకాయల సిబ్బిని కొంత బరువుగా తూచి బిల్లేసురుని కండువాలో వేశాడు. బిల్లేసురుడు కండువా మూటగట్టి రొండి నుండి డబ్బులు తీసి చేయి చాచి నిలబడివున్న రామగులాం చేతికి అందించాడు. రామగులాం "యింకొకకాసు" యివ్వమన్నాడు. బిల్లేసురుడు మందహాసంచేస్తూ "మన గ్రామస్థులకు కూడ బజారు ధరకే అమ్ముతున్నావా?" అడిగాడు. రామగులాం బిల్లేసురుని నఖశిఖ పర్యంతం చూచి - "ఏమయ్యా! నీవు ప్రతి రోజు నాతోటకువచ్చి కూరలు కొంటున్నావా? ఏదో ఈరోజు కూరలు కొనాలని వచ్చావు. లేక ఎవరో బంధువులు వచ్చివుండ వచ్చు! అంతే గదా!"

"ఆలాగయితే రేపు చెల్లిస్తాను. యిప్పుడు నావద్ద చిల్లరలేదు!" అంటూ బిల్లేసురుడు బయలుదేరాడు. బిల్లేసురుడు కూరలు కొనేవాడుకాదు. కూరలుతినాలని కోరిక గల్గితే సెనగలునానబెట్టి నూనెలో మసాలతో వేయించి తినేవాడు.

యిల్లుచేరి దీపం వెలిగించి మేకల పాలు పిదికాడు. మేకలకు ఉదయం తెచ్చిన ఆకులువేసి వంటకు ఉపక్రమించాడు. రొట్టెలు, పప్పు, అన్నం, వంకాయకూర, మామిడి ఊరగాయ, వేడి-వేడి మేకపాలు వడ్డించి అత్తగారికి పీట వేసి నీళ్లు వుంచాడు. అ తర్వాత అత్తగారి వద్దకెళ్లి - "అమ్మా! భోజనానికి లేవండి," అని ఆప్యాయంగా పిలిచాడు. ఆమె సిగ్గుపడుతూలేచి కాళ్లు - చేతులు శుభ్రం చేసుకొని వంట యింట్లోకి వెళ్లి అన్నం తింటూ "నాయనా! నీ యింట బర్రెలు లేవు గదా" మరి ఈ నెయ్యి బర్రె నెయ్యి లాగుంది ఏమిటి?" అని అడిగింది. "అమ్మా! మరి ఇంట్లో భోజనం రుచిగా వుండాలంటే బర్రెనెయ్యి అవసరమే కదా! ఎవరైనా చుట్టాలు - పక్కాలు వస్తే

వారికి మేక నెయ్యి వడ్డించలేం గదా! నేనేమో మేక నెయ్యితో సరిపెట్టు కుంటాను."

మన్నీ అత్త సంతృప్తిగా భోజనం చేసి చేతులు కడుక్కొని మంచం మీద కూర్చొంది. బిల్లేసురుడు ఏలక కాయ మసాలా ద్రవ్యాలలో నుండి ఏరి తెచ్చి యిచ్చాడు. అ తర్వాత అతను భోజనానికి కూర్చున్నాడు. ఈ మధ్య చాలా రోజుల తర్వాత తృప్తిగా భోజనం చేశాడతడు. ప్రక్కయింటి కెళ్లి ఒక మంచం అడిగి తెచ్చాడు. మన్నీ అత్తగారి మంచం మీద పరచిన జనుము గుడ్డ తీసి తన మంచం మీద పరచాడు. మన్నీ అత్తకు మాత్రం అతడు బెంగాలు నుండి తెచ్చిన రంగుల జముకానము పరచాడు. అక్కడ గురువు పత్ని పాత చీరలు చుట్టి కుట్టిన దిండును అత్తగారి కిచ్చాడు. అత్త పడుకొని కళ్లు మూసు కొని బిల్లేసురుని మేకల సంపదను గూర్చి ఆలోచించ సాగింది. బిల్లేసురుడు కూరలకు వెళ్లిన సమయంలో ఆమె ప్రతి మేకను పరీక్షించి చూచింది. ఆ తర్వాత మేకలను - వాటి పిల్లలను లెక్కించింది. ఆమె కెంతో ఆశ్చర్యంకలిగింది. ఇన్నిమేకలు, వాటి పిల్లలవల్ల మూడు పాడి బర్రెల ఆదా యంకన్నా ఎక్కువగా వుండ వచ్చునని అంచనావేసింది.

బిల్లేసురుడు ధైర్యానికి పెట్టిన పేరు. అతని మనస్సులో వివాహాన్ని గూర్చిన కుతూహలంవున్నా ఏమాత్రం బయట పెట్టాడు కాదు. అతనిలో అతను అనుకొన్నాడు. "పాపం అలసి వచ్చింది, విశ్రాంతి తీసుకోవాలి కదా! రేపు ఆమే స్వయంగా ఈ ప్రస్తావన చేయవచ్చు. అలా గాక ఆమె కేవలం ఆశామాషిగా యిక్కడకు రాలేదు కదా! తొందరపడడం దేనికి?"

బిల్లేసురుడు వెళ్లి మంచం మీద పడుకున్నాడు. అతనికి క్రమంగా వెక్కి వెక్కి ఏడ్వడం వినిపించింది. బిల్లేసురుడు అదరిపడ్డాడు. అకారణంగా ఈ ఏడ్పు ఏమిటి? అసలు ఏం జరిగిందని? వివాహ ప్రయత్నం విఫలమైనదని పూర్వసూచకంగా ఈఏడ్పు లంకించుకుందా? ఏమిటి? యిలా అనుకొని గాబరాగా అడిగాడు - "అమ్మా! ఏడుస్తున్నా వెందుకు!" మన్నీ అత్త ఏడుస్తునే "నాయనా! నా బిడ్డ ఏ దేశంలో వుందో ఏమో? యింటినుంచి వెళ్లిన తర్వాత యింత వరకు ఒక జాబు ముక్కైనా రాలేదు."

బిల్లేసురుడు ఓదార్చాడు. "అమ్మా! ఏడుస్తా వెందుకు! వదినెగారు హాయిగా వున్నారు, మా మన్నీ అన్నయ్య ఆమెను చాలా బాగా చూచుకుంటున్నాడు. నేను వెళ్లిన ప్రదేశానికి చాలా దూరంలో మన్నీ వుంటున్నాడు. మన్నీకి చాలా మంచి ఉద్యోగం లభించిందని అంతాచెప్పు కుంటుంటారు. వదినె

గారంటే మన్నీ కెంతో అభిమానం. అంతా నాతో అనేవారు" బిల్లేసుర్, రెండు - మూడు సంవత్సరాల్లో మీ అన్నకు కుమారుడు పుట్టబోతాడని. "వదినె యింకా యుక్తవయస్కురాలు కానట్లుంది" అని సముదాయించాడు.

"వాళ్లు సుఖంగా వుండాలనే నేను దేవుని ప్రార్థిస్తున్నా. నన్నుమోసగించి వెళ్లాడు. నా వాళ్లంటు నాకిక ఎవరున్నారు నీవు చెప్పు! నేనెలాగా నా దినాలు గడుపుతున్నానో నా ఆత్మకెరుక!" అంటూ మన్నీ అత్త నిట్టూర్పు వదిలింది.

"అమ్మా, నీకు మన్నీ ఏలాగో నన్ను ఆలాగే భావించుకో. నీవు యిక్క దేవుండు. అన్నానికి నీకేమీ లోటు వుండదు యిక్కడ. నాకు వేళకు మంచి భోజనం అమరుతుంది," అన్నాడు.

మన్నీ అత్త చాలా సంతోషించి - "నాయనా! నీవు చిరకాలం వర్ధిల్లు. నీ దిక్కు నాకు వుండనేవుంది, ఎటూ వచ్చాను గదా! ఆలాగే కొద్ది రోజులుండి వెళ్తాను, నీ పనుల్లో కొద్దిగా సహాయపడతా! నీ పెండ్లి వ్యవహారం చూడాలిగదా? పెండ్లి అవగానే నీ కుటుంబ వ్యవహారాలన్నీ ఆ అమ్మాయికి తెలియచెప్పి - నేర్పి మరీవెళ్తాను."

"అంత కంటే మంచి విషయం మరేముంది అమ్మా!" బిల్లేసురుడు పౌరుషం ఉట్టి పడేలాగా అన్నాడు.

"నాయనా! యింత వరకు నీకు అసలు విషయం చెప్పాను కాను. నీ పనులన్ని చక్కదిద్దుకొన్న తర్వాత చెబుదామని ఆగాను. పెళ్లికూతురు నీకు అన్ని విధాల సమవుజ్జిగానే వుంటుంది. పైగా యుక్త వయస్కురాలు కూడా అయింది. నాబిడ్డ కలరు లేదు కానీ మంచి స్వభావం. ఇంటి వ్యవహారాలు బాగా చక్కదిద్ద గలదు. మరి నీకు యిష్టమేనా?"

"మీకు అన్ని విషయాలు తెలుసు. మీకు నచ్చితే నేను కాదంటానా అమ్మా! నాకు నచ్చినట్లే!"

మన్నీ అత్త సంతోషించి మళ్లీ అన్నది - "ఆలాగే, ఈ సంబంధమే కుదుర్చుకుందాం. ఆ పిల్లకు నీవల్ల ఏలాటి కష్టం వుండదు. అయితే ఆ అమ్మాయి అమ్మకు నీవు కొంత సహాయం చేయాల్సి వుంటుంది. పెళ్లి కాక పూర్వమే కొద్దిగా, అంటే ఒక ముప్పది రూపాయిలు యివ్వాలి. ఆమె బీద రాలు, పైగా అప్పులున్నాయి. ఆ తర్వాత వీలున్నపుడు. కొద్ది కొద్దిగా సహాయపడుతు వుండాలి. ఆమెకు తనవారంటూ ఎవరు లేరు. నేను అమ్మాయిని నీ యింటికే పిలుచుకొని వస్తా. నీవు యిక్కడే పెళ్లిచేసుకో. పెండ్లి అమ్మాయి

యింటి వద్ద చేయాలంటే ఆ ఖర్చులన్నీ నీవే భరించాల్సి వుంటుంది. నీకు కావలసిన ముఖ్యమైన నల్గురు ఐదుగురు బంధువులను పిలువనంపుకొని యిక్కడే పెళ్లి చేసుకో, వృధాగా ఖర్చు చేయడం దేనికి?"

ఆమె మాటల్లో మోసం లేదని బిల్లేసురుడు గ్రహించి, "అమ్మా! నీ సలహా నాకు కూడా నచ్చింది" అన్నాడు.

ఆ తర్వాత మన్నీ అత్తగారు బిల్లేసురుడి యింట్లో చాలా రోజులు గడిపి అతడికి మంచి వంటలు చేసిపెట్టింది. బిల్లేసురుడి దేహచ్ఛాయ మారింది. అతడు ఆమెను వివాహం పూర్తి అయినంతవరకు అక్కడే వుండమనికోరాడు. అందుకు ఆమెసమ్మతించింది.

ఆ గ్రామంలో బిల్లేసురుడు ఒక చర్చనీయాంశం అయ్యాడు. ఒకరోజు త్రిలోచనుడు మన్నీ అత్తగారిని ఘేరావోచేసి "నిజం చెప్పు! నీవు ఏ సంబంధం బిల్లేసురుడికి అంటగడుతున్నావ్!" అని గద్దించి అడిగాడు.

"మా బంధువుల అమ్మాయినే!" మన్నీ అత్త బదులు చెప్పింది.

"ఏవూరు?"

"ఏమిటి నీ పెత్తనం నామీద. బిల్లేసురుడివా నీవు? నేనేదో మంచి ఉద్దేశంతో మావాడికి సహాయపడాలనుకుంటున్నా. అసలు నీవెవరు? బిల్లే సురుడికి ఏమవుతావో చెప్పు?"

"నేనెవరినో ఈ పెండ్లి అయిన తర్వాత నీవే తెలుసు కుంటావు. బిల్లే సురుని కుల బహిష్కారం చేస్తాం! తెలుసా?"

"చుట్టు పక్కాలు, బంధు మిత్రులు యితని పక్షాన వుంటే ఆ భగవం తుడు కూడా యితన్ని కులాన్నుంచి వెలివేయలేడు. నీవు మర్యాదగా మాఇంటి నుండి బయటకెళ్లు, వెలివేసే ఏర్పాట్లేమయినా వుంటే చూచుకో!" త్రిలోచ నుడు అవమానపడి యింటి నుంచి బయటికి అడుగుపెట్టాడు.

బిల్లేసురుడి రోజులు హాయిగా గడుస్తున్నాయి. అతని పొలంలో గెనుసు గడ్డలు బాగా వూరాయి. ప్రతి రోజు గెనుసు గడ్డలు కాల్చి మేకపాలతో పాటు మన్నీ అత్తకు యిచ్చేవాడు. మన్నీ అత్త తన అల్లుని మీద ఎంత కోపంగా వుందో అంతకు రెట్టింపుగా బిల్లేసురుడి మీద ఆమెకు ప్రీతి. ఆమె యింటికి వచ్చిన తర్వాత బిల్లేసురుడు రాత్రుల్లో గెనుసుగడ్డల్ని కాపలాకాస్తూ పొలంలో వుండే వాడు. ఒకటి రెండు రోజులు అడవి పందుల బెడదతగిలింది. రెండు - మూడు రాత్రుల్లో దొంగలు కొన్ని గెనుసుగడ్డలు త్రవ్వుక వెళ్లారు. యిలా జరిగితే నష్టం రావచ్చనే అభిప్రాయంతో మన్నీఅత్తగారు గెనుసుగడ్డలన్నీ

ఒకే పర్యాయం త్రవ్వక రావలసిందిగా సలహాయిచ్చింది. అతడాలాగే చేశాడు. గెనుసుగడ్డలతో యిల్లు నిండిపోయింది. అంత కుప్పను అతడు ఎప్పుడూ చూచి ఎరుగడు. ఒక్కొక్క గడ్డ సున్నీ కళ్లులాగా వుంది. గెనుసుగడ్డల రాశిని చూచి నవ్వుతూ మన్నీ అత్త "బాబు! వీటితో నీ పెళ్లి జరుగుతుంది. పైగా నెలరోజుల పర్యతం తినేందుకు ఈ గడ్డలు మిగులు పాటు అవుతాయి," అన్నది.

"అమ్మా! యిదంతా నీ ఆశీర్వాద ఫలమే? కాక పోతే నేనేమాత్రపు వాడిని!" బిల్లేసురుడు వినయంగా అన్నాడు.

"నాకుమారుడు జీవించివుంటే ఈ పాటికి నీలాగా వుండేవాడు! పొలం - పుట్రపని చేసేవాడు. నాకీ దుర్గతి పట్టేదికాదు." మన్నీ అత్తను ఓదార్చుతూ బిల్లేసురుడు అన్నాడు - "నన్నే నీకుమారుడు అనుకో తల్లీ! నీవేమీ బాధపడకు. నాబొందిలో ప్రాణమున్నంత వరకు నీకు సేవచేస్తా."

అత్తగారు కొంగుతో కళ్లు అద్దుకుంది. బిల్లేసురుడు పక్క గ్రామంలో గెనుసుగడ్డల వ్యాపారిని కలిసేందుకు వెళ్లాడు, తిరుగుప్రయాణంలో మేకలకు ఆకులు కోయవచ్చని అభిప్రాయపడ్డాడు.

మరునాడు ప్యాపారస్థుడు వచ్చాడు. బిల్లేసురుడు 70 రూపాయల గెనుసుగడ్డలు అమ్మాడు. అతనికి అంత మొత్తం రావడం మూలాన మొత్తం గ్రామంలో అదొక చర్చనీయాంశం అయింది. రాబోయే సంవత్సరం రైతులంతా గెనుసుగడ్డల పంట పండించాలని నిశ్చయించుకున్నారు.

## పదిహేను

కార్తీకమాసపు వెన్నెల, నులివెచ్చటి చలి. సవనజాతి పక్షులు ఎక్కడ నుండో ఎగిరి వచ్చిచలి కాలంలో చింతరెమ్మల మీద గూళ్లు కట్టుకో సాగాయి. బిల్లేసురుడు రాత్రుల్లో అరుగు మీద కూర్చొని ఆకాశంవైపు చూస్తూ వుండేవాడు. కొద్దిరోజుల క్రితం ఆకాశంలో కనిపించిన జింకలాంటి దృశ్యం యిప్పుడు కన్పించటం లేదు. బిల్లేసురుడు అంటూ వుండేవాడు - ఈ జంతువులకు ఎక్కడ మేత లభిస్తే అక్కడికి అంతా వెళ్తూవుంటాయని. సాయంత్రం సమయాల్లో మంచుకురిసేది. ఆ కారణంగా చాలాసేపు కూర్చునేందుకు వీలు పడేదికాదు. జానపదులు త్వరగా భోజనం ముగించుకొని పడుకునేవారు.

బిల్లేసురుడు యిల్లుచేరాడు. మన్నీ అత్త అన్నం వండి సిద్ధంగా వుంచింది. ఆమె పెట్టిన అన్నంతిని బిల్లేసురుడు నునుపుగా తయారయ్యాడు. కాళ్లు - చేతులు శుభ్రం చేసుకొని అన్నం తినేందుకు కూర్చున్నాడు. మన్నీ అత్త పళ్లెరంలో అన్నం వడ్డించి అతనివైపు చాచింది. అన్నం తినకపూర్వం చెంబు లోని నీళ్లు చేతిలో పోసుకొని మూడు పర్యాయాలు పళ్లెం చుట్టు చల్లి తర్వాత భోజనానికి ఉపక్రమించేవాడు.

బిల్లేసురుడు నీళ్లు చల్లి అన్నం తినడం ప్రారంభించాడు. మన్నీ అత్త గారు "నాయనా! పుష్య మాసం రాబోతోంది, యిక నే వెళ్లిరానా?" అంటూ మళ్లీ మొదలెట్టింది. "అపనికూడా చూడాలి గదా మరి!"

నోటిలోని ముద్ద మ్రింగి గంభీరంగా అన్నాడు. "అవును మరి ఆపని కూడా చూడలిగదా! అది చాలా ముఖ్యమైన పని!"

"ఆ మాటే అంటున్నా!" కొద్దిగా ముందుకు జరిగి. "కొద్దిగా డబ్బు ముందుగా యిప్పుడు యివ్వు. కొంచెం డబ్బు తర్వాత - పెండ్లికి రెండు మూడు రోజులు ముందుగా యివ్వు!" అన్నది.

రూపాయల మాట వినగానే బిల్లేసురుడు కొంత తడబడ్డాడు. కానీ రూపాయలు ఖర్చు చేయకుండానే పెళ్లి కావడం అసంభవం. అనుకుం టూనే - "అమ్మా! మనం యింకా పురోహితుణ్ణి సంప్రదించలేదు గదా! ఒక వేళ ఆయన ఏదైనా దోషమున్నట్లు చెబితే అప్పుడేమి చేయాలి?" సందేహం వెళ్లబుచ్చాడు.

"నీవన్నీ పిల్లచేష్టలుగా వున్నాయి" ప్రగాఢ విశ్వాసంతో తలపైకెత్తి అన్నది. "ఆ అమ్మాయిలో వెదకినా కూడా ఏ దోషం లేదు. ఆలాంటప్పుడు పెళ్లి ఎందుకు కాదు? బాబు! ఆ అమ్మాయి చాలా నెమ్మదస్తురాలు అంటే నమ్ము. ఆమె పెళ్లి ఏనాడో జరిగి వుండేది. రామభేలావన్ పరదేశం నుండి వచ్చి చేతులు జోడించి ప్రాధేయపడ్డాడు."

"పిన్నీ! నాకు పెళ్లి ఏర్పాటు చేయాలి. నీవెంత డబ్బుకావాలంటే అంత యిస్తాను." నేను ఆ అమ్మాయి తల్లిని సమ్మతింపజేసి జాతకాలు జ్యోతిష్కునికి చూపించా. ఇద్దరి జాతకాలు చక్కగా అమిరాయి. అతడు పెళ్లి కూతురు తల్లికి మూడు వందలు యిచ్చే ఏర్పాటు జరిగింది. చివరి క్షణంలో పెళ్లి కొడుకు పెళ్లికాగానే పెళ్లి కూతురును పరదేశం తీసుకెళ్తాడని తెలిసి ఆ వివాహం రద్దు చేసుకొంది. ఆమె భయం ఏమిటంటే పరదేశం వెళ్లాక వాళ్లు మళ్లీ యిటు వైపు తిరిగి చూడడమంటూ జరుగదు. జబ్బుపడితే ఒక గంటెడు

నీళ్లు నోట్లో పోసేవారు కూడా వుండరు. డబ్బు తీసుకొని నేనేంచేయాలి? యీలాగా నిశ్చయమైన పెళ్లి తెగ-తెంపులు చేసు కోవాల్సి వచ్చింది. ఆ తర్వాత చుకందరపురం జమీందారు రామనేవాజ్‌తో అమ్మాయి పెళ్లి నిశ్చయం అయింది. తాంబూలం పుచ్చుకునే రోజున పెళ్లికూతురు అమ్మకు ఒక ఆసామి జమీందారు ఔరసపుత్రుడు కాదని, తన తండ్రికి కాక మరొకరికి కల్గాడని గట్టి నమ్మకం కుదిరేలాగా చెప్పాడు. ఆ కారణంగా రెండో పెళ్లి కూడా ఆగి పోయింది. ఇలాగా ఎన్నో సంబంధాలు కుదిరాయి, కానీ ఆఖరి క్షణాల్లో ఏదో కారణంగా ఆగిపోయాయి."

అమ్మాయి ప్రవర్తనలో ఎలాంటి లోపంలేదని బిల్లేసురుడికి నమ్మకం కలిగింది. అతడు సంతోషపడ్డాడు. కానీ మన్నీ అత్తగారి భావావేశం ఏమాత్రం తగ్గలేదు. "బాబు! అసలు విషయానికి వద్దాం! నీవు మావాడివి కాబట్టి చెబు తున్నా. వందరకాలుగా అబద్ధాలుచెప్పి ఆ ముండను మనసు కరిగేలాగా చేయకపోతే నీకీసంబంధం కుదరదు."

బిల్లేసుడు ఆవేశంగా అన్నాడు-"నీవేమో ఆమె చాలా మంచి గుణవం తురాలు అని చెప్పావు కదా మరి?" "మాట సామెతకు అందర్ని గుణవంతు లంటాం. కానీ, ప్రతివాళ్లు వాళ్ల అంతస్థు, ఆస్తులు చూస్తారుగదా! పైగా ఆవిడకు పది ఎకరాల పొలం వుంది, నీ లాంటి వాడికి ఎలా తన కుమార్తెను కట్టబెడుతుంది? నేనామెకు బాగా నూరిపోశాను. దుర్గాదాసు సుకుల్ వంశస్థుడు. పరదేశం వెళ్లి బాగా సంపాదించుక వచ్చాడు, కానీ నీకు డబ్బంతా ఒకసారి కావాలంటే ఆపని మాత్రం జరుగదు. కొద్ది, కొద్దిగా యిస్తాం, నీడబ్బు ఎక్క డికిపోదు. ఇలాగా అనేక విధాల ఆమెకు తెలియ జెప్పాను. అప్పుడు గానీ నీ సంబంధానికి సమ్మతించలేదు. అందువల్లే నీతో చెప్పాల్సివచ్చింది. నీవు 30 రూపాయలు పెళ్లికి పూర్వమే యివ్వాలి. ఆ తర్వాత అప్పుడప్పుడు సహాయం చేస్తూవుండు," అనిచెప్పి అత్తగారు నిర్నిమేషదృష్టితో బిల్లేసు రుని కళ్లలోకి చూడసాగింది. యింత తక్కువ మొత్తానికి కూడా సమ్మతించక పోవడం మూర్ఖత్వమే అవుతుందని భావించి బిల్లేసురుడు అన్నాడు- "అమ్మా! రేపు నీవు నా జాతకం, ఒక రూపాయ తీసుకొని బయటదేరు. మూడు - నాలుగు రోజుల తర్వాత నేను. స్వయంగా వచ్చి జాతకాలు కుదిరాయో, లేదో తెలుసుకుంటాను."

"ఒకసారి కాదు, పది పర్యాయాలు విచారించి మళ్లీ రా! అయితే నీతో కనీసం 15 రూపాయలైనా పట్టుక రావాలి సుమా!"

బిల్లేసురుడు - మన్నీ అత్త భోజనాలు ముగ్గించి తమ తమ ఆలోచనల్లో పడ్డారు. సూర్యోదయానికి పూర్వమే నిద్రలేచి బిల్లేసురుని మేలుకొల్పాలని అభిప్రాయంతో ఉచ్ఛస్వరంలో రామనామం జపించసాగింది.

బిల్లేసురుడు కళ్లు నులుముకుంటూ లేచి. "అమ్మా! యింత ఉదయాన్నే బయలుదేరాలను కున్నావా?" అని అడిగాడు.

మన్నీ అత్త కళ్లలో కన్నీరు మెదిలాయి. "నాయనా! ఆలస్యమైతే అక్కడ చేరే సమయానికి రాత్రి అవుతుంది. మన పని కాదు."

బిల్లేసురుడు ఆ చీకట్లోనే ట్రంకు తెరచి జాతకం తీసి ఆమె చేతికిస్తూ "జాగ్రత్తగా వుంచాలి" అని చెప్పాడు.

"జాగ్రత్తగానే వుంచుతాను, నాయనా! నాకు మాత్రం తెలియదా!" అన్నది. బిల్లేసురుడు రొండి నుండి ఒక రూపాయితీసి ఆమె పాదాలు స్పర్శించి "యీ మొత్తం ఒకలెక్కలోకి కాదమ్మా" అన్నాడు.

"నేనేమీ అనలేదు కదా నాయనా!" అంటూ తన అసంతోషాన్ని దిగ మింగి యింటి దారిపట్టింది. అప్పటికి బాగా తెల-తెలవారుతోంది.

## పదహారు

బిల్లేసురుడు ఈమధ్య చాలా గొప్ప పనిచేశాడు. గెనుసుగడ్డలు వేసిన పొలంలో బటానీలు, మరోపొలంలో సెనగపైరు పెట్టాడు. అవి బాగా ఏపుగా పెరిగాయి.

పొలం పనిలో నిమగ్నుడైన బిల్లేసురునికి అకస్మాత్తుగా అత్తగారు జ్ఞప్తి కొచ్చారు. పెళ్లి లతకు మొగ్గలు తొడగసాగాయి. ఒల్లు పులకరింపసాగింది.

చివరకు పెండ్లి సంబంధం నిశ్చయించుకోవలసిన రోజు రానేవచ్చింది. బిల్లేసురుడు పాలు పితికి, ఒక కలశంలో నింపి బట్టతో మూతి బిగించి కట్టాడు. బయలుదేరుటకు పూర్వం రాత్రి కోసుక వచ్చిన ఆకులు మేకల ముందు పడ వేశాడు,

తర్వాత నీళ్లు తోడుకొని స్నానంచేశాడు. కొద్ది నిముషాలు పూజచేశాడు, ప్రతినిత్యం పూజచేసే అలవాటు అతనికిలేదు. పూజలో వుండగా అద్దంలో అనేక పర్యాయాలు తన ప్రతిబింబాన్ని చూచుకున్నాడు - చందనం పూసు కొని మరొక పర్యాయం తల అటు - యిటూ తిప్పి, కళ్లు - కనుబొమలు ముడిచి మరీ మరీ తల, బుగ్గలు, పెదవులు కదిలిస్తూ తన స్వరూపాన్ని

చూచుకున్నాడు. కళ్లు పరికించి మళ్లీ చూచుకున్నాడు - అతని ముఖంలో ఆటలమ్మ మచ్చలు స్పష్టంగా కన్పిస్తున్నాయి. మరి కొంతసేపు గాయత్రీ మంత్రం తప్పులతో జపించాడు. మనస్సులో ఒక పర్యాయం తన సంకల్పం తప్పక ఫలిస్తుందని ధృఢ నిశ్చయం చేసుకున్నాడు. అటు తర్వాత పూజ సామగ్రి సర్ది ఒక గదిలోపల అటక మీదవుంచి, సద్ది రొట్టెలు ఆరగించాడు. కాళ్లు చేతులు కడుక్కొని బట్టలు మార్చుకున్నాడు. మేజోళ్ల క్రింది భాగం వరకు లాగి పంచె కట్టుకున్నాడు. జుబ్బాతొడుగు కొని చాపమీద కూర్చొని రుమాల చుట్టుకున్నాడు. మరోసారి అద్దంలో తన ప్రతిబింబాన్ని చూచు కున్నాడు. అనేక రకాల భంగిమల్లో ప్రతిబింబాన్ని మరీ - మరీ చూచుకొని తృప్తిపడ్డాడు. ఆపైని జేబులో ఒకచిన్న అద్దం వేసుకొని మెడలో ఒక కండువా ధరించి చేతిలో కర్ర పుచ్చుకున్నాడు. అంతకు పూర్వమే నూనెతో శుభ్రం చేసి పెట్టిన బూట్లు ధరించాడు. తలుపులు మూసి తాళం వేశాడు. పాలకలశాన్ని చేతికి అందుకొని అధోదృష్టితో బయలుదేరాడు. కొద్ది దూరం వెళ్లగానే నిండుకుండతో ఎవరో ఎదురయ్యారు. బిల్లేసురుడు ఎంతో ఆనందించాడు. నిండు కుండతో వస్తున్న ఆమె మందహాసం చేసి, "మరి నాకెప్పుడు తీసి తినిపిస్తావు?" అని అడిగింది. తన శుభకార్యం పూర్తి అవగానే తప్పక మిఠాయిలు పంచిపెడతానని మాటయిచ్చి మరీ ముందుకు సాగాడు.

కొంత దూరం వెళ్లగా ఒక కాలువ, ఆ కాలువగట్టున తుమ్మ చెట్టు, వేప చెట్టు కన్పించాయి. బిల్లేసురుడు వైశ్యుల చెరువుగట్టు ప్రక్కగా నడిచాడు. దూరాన్నే అతన్ని చూచి కొన్ని కొంగలు ఈ గట్టునుండి అవతలి గట్టుకు ఎగిరి వెళ్లాయి. బిల్లేసురుడు ఏకాగ్ర చిత్తంతో ప్రయాణం సాగిస్తున్నాడు. మరోచోట ఈత, తాటి చెట్లు కన్పించాయి. కళ్ల ఎదుట పచ్చదనం దుప్పటి లాగా పరచుకొని వుంది. మంచు బిందువుల మీద సూర్యని లేత కిరణాలు నాట్యం చేస్తున్నాయి. కళ్లలో రక-రకాల భావాలు మెదులు తున్నాయి. మదిలో గిలిగింతలు, కాళ్లు వేగంగా కదలుతున్నాయి. అతడి చేతిలో పాలతో నిండిన కలశం వుందన్న విషయమే మరచి పోయాడు.

మరికొంచెం దూరం వెళ్లాక మట్టి రోడ్డుకు యిరువైపులా మామిడి, యిప్పచెట్లు కనిపించాయి. శీతకాలపు బంగారు పన్నెగల ఎండ వడపోత చెంది ప్రసరిస్తోంది. ఆశఫలీభూతమైన రీతిలో పొలాలు, తోటల మధ్య గ్రామంలోని గోడలు కన్పించసాగాయి. బిల్లేసురుడు ఆతురతగా అడుగులు ముందుకు వేశాడు. సందు - గొందుల మధ్య బిల్లేసురుడు గ్రామంలో అడు

గుపెట్టాడు. బావి అరుగు మీద కూర్చుని ఒక వృద్ధుడు సూర్యుని దర్శిస్తూ కంపిత కంఠంతో మాల జపిస్తున్నాడు. మరి కొన్ని అడుగులు వేశాక ఒక వడ్రంగి యిల్లు. బండి చక్రాల చట్రాలు తయారు చేస్తున్నట్లు టక్ టక్ ధ్వని దూరం నుండే వినిపిస్తోంది. మరి కొంచెం ముందు కెళ్లాక ఒక దర్జీ దుకాణం కనిపించింది. అక్కడ చాలా మంది కూర్చుని వున్నారు. దర్జీదు కాణం దండెం మీద రకరకాల రంగుల వస్త్రాలు కుట్టు పనికి ఎదురు జూస్తున్నాయి. దర్జీ తల వంచుకొని తత్పరతో బట్టలు కుడుతున్నాడు. ఒక పిల్లవాడు ఆ చా వడికి మరో వైపున కూర్చుని దూది నింపిన రజాయికి టాకాలు వేస్తున్నాడు. యిద్దరు పని వాళ్లు కొత్త బట్టలు కొలతల ప్రకారం కత్తిరించి మిషను పైన ఎక్కించేందుకు టాకాలువేస్తున్నారు. జానపదులు ఆ రంగు - రంగుల వస్త్రాలు చూస్తూ కర్ర సహాయంతో నిలబడి పొగాకు తుప్పుకుంటూ గప్పాలు కొట్టు కుంటున్నారు. బిల్లేసురుడు ఒక లక్ష్యంతో అత్తగారి యింటి వైపువెళ్లాడు. ఒక సందులో అత్తగారి అర్థశిధిలావస్థలో వున్న యిల్లు కన్పించింది. అ యింటి తలుపులు తెరచుకునే వున్నాయి. బిల్లేసురుడు అత్తగారిని పిలుస్తూ యింటిలోపల ప్రవేశించాడు. అత్తగారు బిల్లేసురుని రాకకు ఎదురు చూస్తోంది. అతన్ని చూడగానే చిరునగవుతో లేచినిలబడింది. ఆమె దృష్టి కలశం మీదనే వుంది. బిల్లేసురుడు కలశాన్ని క్రింద దించి అత్తగారి పాదాలు స్పర్శించాడు. అత్తగారు ఎన్నో సంవత్సరాల అనంతరం కలుసు కున్నట్లు అనుభూతిని వ్యక్తం చేస్తూ కుశల ప్రశ్నలు వేసింది. ఆ తర్వాత ఒక మంచం మీద అతన్ని కూర్చుండ బెట్టి బిల్లేసురుని పెండ్లి గురించిన ఉత్సాహన్ని పసిగట్టే ప్రయత్నంలో నిమగ్న మైంది.

బిల్లేసురుడు గంభీరంగా కాసేపు మౌన ముద్ర వహించి ఒక మంచి గృహస్థుని అనుభవాన్ని పునికి పుచ్చుకున్న ధోరణిలో "అత్తయ్యా! జ్యోతిష్యునికి జాతకాలు చూపించారు కదా?" అని అడిగాడు.

సముద్రంలో తుపాను చెలరేగిన పద్ధతిలో ఉద్వేలితురాలై - "నాయనా, జోతిష్యుడు అమ్మాయి జాతకం చూచి - అమ్మాయి సాక్షాత్తు లక్ష్మి సమాను రాలు, మెట్టినింట పాదంమోపగానే ఆ యిల్లు సిరి సంపదలతో తులతూగు తుంది. మీ యిద్దరి జాతకాలు బాగా సరిపోయాయి. అమ్మాయి చామన ఛాయ, దేవగణము, గణాలలోవైరంలేదు. బాగా జాతకాలు గుణించి చెప్పా డుగదా? అమ్మాయి కులం వున్నతమైనది. ఆ కారణంగా బిల్లేసురుడు కూడా కొంత గొప్ప కుటుంబానికి చెందిన వాడుగా చెప్పుకోవాలి మరి! కనీసం

దుర్గాదాస్ వంశానికి చెందిన వాడని, కుల, గోత్రాలు వున్నతమైనవని చెప్పు కోవాలి. మరి అలాకాకపోతే అతను అవమానాలపాలు కావలసి వస్తుంది," అన్నది.

అత్తగారి మాటలు విని బిల్లేసురుడు ఉబ్బి తబ్బిబ్బయ్యాడు. ఎంతో వినయం నటిస్తూ అన్నాడు- "అమ్మా! తల్లి - దండ్రుల మాట అంతా పాటిస్తారు కదా! నీవు నాకు తల్లితో సమానం. నీవెలా చెప్పమంటే ఆలాగే చెపుతాను."

అత్తగారు బిల్లేసురుడి మాటలకు తృప్తిపడి తనయింటికే ఒక పురోహి తుణ్ణి పిలుచుక వచ్చింది. పురోహితుడు 'శీఘ్రాతిశీఘ్రమేవ' అంటూ ఆ వివా హానికి ముహూర్తం పెట్టాడు. బిల్లేసురుడు శ్రద్ధాభక్తితో సమ్మతి తెలిపాడు. రాబోయే ముహూర్తాలలో లగ్నం నిశ్చయమైంది. అత్తగారి ఆదేశానుసారం ఆమె యింటిలోనే వివాహం జరగాలని నిశ్చయింపబడింది. సాయంత్రం అత్త గారింటికి ఒక అమ్మాయిని తీసుకవచ్చారు. దీపపు కాంతిలో బిల్లేసురుడు పెళ్లికుమార్తెను తిలకించాడు. అమ్మాయిలో ఏలాంటి దోషం లేదని విశ్వా సంకల్గింది అతనికి. పెళ్లికుమార్తె కాళ్లు - చేతులు మాత్రం అతను చూడ గలిగాడు. ఆమె ముఖంమాత్రం చూడలేదు. పెళ్లికుమార్తె తల్లితో చాలా సేపు మాటలు జరిగాయి. వాళ్లందరికి ధైర్యంచెప్పి యింటి ముఖం పట్టాడు. యింటికి బయలు దేరుతూ డబ్బులు మన్నీ అత్తగారి చేతిలో వుంచి వుల్లా సంగా యిల్లుచేరాడు బిల్లేసురుడు.

# పదిహేడు

బిల్లేసురుడు ఏదో దుర్గాన్ని జయించిన వీరుడిలాగా వూరు చేరుకున్నాడు. గ్రామంలో తలెత్తుకొని ఆత్మవిశ్వాసంతో సంచరించసాగాడు. గ్రామస్థులంతా గెనుసు గడ్డల లాభాల ప్రభావమేమోనని భావించారు. క్రమంగా అతని పెళ్లి రహస్యం రట్టయింది. త్రిలోచనుడు తన ఆప్తమిత్రుణ్ణి కలుసుకున్నాడు. అక్కడ అతను అసలు విషయం తెలుసుకొని విస్తుపోయాడు. అతను పెళ్లి చేసుకోవాలని అభిప్రాయపడిన అమ్మాయితోనే బిల్లేసురుడి వివాహం జరుగ బోతోంది. గ్రామంలోని విదురులు, బిల్లేసురుని కన్నా ఎక్కువ వయస్సువాళ్ల నోళ్లలో వెలక్కాయపడింది. అసూయచెంది త్రిలోచనుడు బిల్లేసురుని వ్యతి రేకంగా ప్రచారంసాగించాడు. "వీడు బ్రాహ్మణ కులంలో పుట్టాడు, తండ్రి

ఎవరో తెలియని కన్యతోపెళ్లి చేసుకోబోతున్నాడు. మంచి కుటుంబీకులు అతని యింటిలో అడుగుపెట్టే అవకాశం కూడా లేకుండా చేసుకున్నాడు" అని పరి పరి విధాల నిందలు మోపాడు.

బిల్లేసురుని పెళ్లి మూహూర్తం నిశ్చయమైనదని తెలుసు కొని గ్రామం లోని రకరకాల వృత్తుల వారు అతని యింటికి ప్రదక్షిణలు ప్రారంభించారు. కొంత మంది వందిమాగదుల్లాగా - ఈయింటి స్వరూపమే మారిపోతోంది ఒక కొత్త వెలుగు రాబోతోంది. ఒక సంవత్సరంలోగా తండ్రి - తాతల వంశాన్ని నిలబెట్టగలడు అన్నారు. పనిపాటలవాళ్లు ఆ దారిన వెళ్లుతూ ఆ ఇంటిని శూన్యంగా చూచి నిట్టూర్పువదలి ఉదాసీనంగా వెళ్లిపోయేవారు. యిక తృణమో- పణమో ముడుతుంది అనుకున్నారు. బిల్లేసురుడి ఎదలో గిలిగింతలు పెట్టే అనుభూతి పొంది మందహాసం చేయసాగాడు. యిప్పుడు అందరూ అతన్ని పొగడేవారే! ఈ ఆలోచన రాగానే తన ఆర్థికస్థోమతను మించి అట్టహాసంగా పెళ్లి జరిపించు కోవాలని నిశ్చయించుకున్నాడు. జనమంతా యిక తనను పరిహాసంచేసేందుకు భయపడాలి. వాళ్లకు అంతో యింతో ముట్టుచెప్పక పోతే దారిన నడవడం కూడా దుర్లభమవుతుంది. తాత - ముత్తాతలపేరు ప్రతిష్టలు మట్టిలో కలసిపోతాయి. పెళ్లి ఖర్చులు భరించేందుకు సాహసం కూడగట్టుకున్నాడు.

మంగలి ప్రతిదినం క్రావుచేస్తానని, మాలిష్ చేయించుకోమని యింటి చుట్టూ తిరుగ నారంభించాడు. భిస్తీవాడు పిలువకనే యింటికొచ్చి నాలుగు బిందెలు నీళ్లుచేది తొట్టి నింపి వెళ్లేవాడు. దూదేకులవాడు వత్తులు తయారు చేసుకునేందుకు నాలుగు వత్తులకట్టలు యిచ్చివెళ్లాడు. చర్మకారుడు పెళ్లికి కిర్రు చెప్పులుకావాలా? మామూలు చెప్పులు కుట్టమంటావా అని అడిగి వెళ్లాడు. కాపలావాడు ప్రతిరోజు అర్థరాత్రి సమయంలో పారాహుశార్ అనికే కలువేస్తూ జాగ్రత్తగా యింటికి కాపలా కాస్తున్నానని గుర్తుచేసి వెళ్లసాగాడు. పురోహితుడు రెండు జతల జందాలు యిచ్చివెళ్లాడు. భట్రాజు ఒకరోజున సీతాస్వయంవరం ఘట్టాలు చదివి వినిపించివెళ్లాడు. మొత్తానికి ప్రతికులస్థుడు ఏదోవిధంగా అతనికి కనిపించివెళ్లారు.

గ్రామంలో బిల్లేసురుడి పరపతిపెరిగింది. జమీందారు స్వయంగా అతని యింటికి వచ్చాడు. ఇంకే ముంది. మొత్తం గ్రామం అతని యింటి వద్ద వాలింది. అంతా ఆలోచించసాగారు ఎవరికి తోచిన ధోరణిలో వాళ్లు తమ పబ్బం గడుపుకోవాలని అనుకున్నారు. జమీందారు బిల్లేసురుడి యింటికి

వెళ్లారు. బిల్లేసురుని వివాహం కాబోతోంది. కనీసం రెండు రూపాయలైనా కానుకగా యిస్తాడు. ఆపైన ఏదో పనికి సహాయపడవలసినదిగా కోరవచ్చు. పైగా కాన్పూరు నుండి గోధుమపిండి, చక్కెర తెప్పించే పక్షంలో బండిబాడుగతోపాటు తూకంలో కూడా కొద్దో - గొప్పో దొరకకపోదు అనుకున్నాడు.

త్రిలోచనుడు కూడా జమీందారు వెంట బిల్లేసురుని యింటికి వెళ్లాడు. అతడికి అంతో-యింతో ముట్టవచ్చునని వూహించాడు. కానీ త్రిలోచనుని చూడగానే బిల్లేసురుడు ముఖంచిట్లించుకున్నాడు. జమీందారు గారికి కానుకలు యిచ్చుకోవలసినదిగా అందరూ బిల్లేసురుని ప్రేరేపించారు - "రిక్తపార్థిన పశ్యేత్ రాజనం దేవతాం గురుమ్." అయినా బిల్లేసురుడు బెల్లంకొట్టినరాయి లాగా కదలకుండా కూర్చునేవున్నాడు. జమీందారుగారు కాసేపటి తర్వాత నిరాశతో వెళ్లిపోయారు.

మరునాటి నుండి బిల్లేసురుడి గౌరవం గ్రామంలో నాల్గురెట్లు పెరిగింది. జమీందారు బిల్లేసురుడి యింటికి వెళ్లాడంటే దాని అర్థం అతనికి తప్పక లంకెబిందెలు దొరకి వుండాలి. అందరు వారి బుద్ధికి తోచినట్లు ఊహాగానాలు చేయసాగారు. ఒకడన్నాడు కదా - "బంగారు యిటుకలు ఎత్తుక వచ్చాడు. ఆ విషయం రహస్యంగా దాచాడు. దొంగసన్యాసి యిక రెండేళ్లలో అతడు మొత్తం గ్రామాన్నేకొనేస్తాడు." మరొకడు అన్నాడు- "మహారాజాగారి యింటిలో నుండి బంగారు నగలు దొంగలించుకవచ్చాడు. కాని యింట్లో దాచుకోకుండా బయట ఏదో చెట్టు క్రిందపాతిపెట్టి వుంటాడు. దొంగల భయం లేకుండా జాగ్రత్త పడ్డాడు." ఇలా అతని గూర్చిన ప్రచారంతో పాటు అతని గౌరవం కూడా యినుమడించింది. ఇతర గ్రామస్థులు కూడా ఆదారిన వెళ్తూ ఆ యింటి వద్ద ఆగి బిల్లేసురుని పలకరించి మరీ వెళ్లేవారు.

ఒక రోజు బిల్లేసురుడు నాయీబ్రాహ్మణుని పిలవనంపి సందేశం పంపాడు- "మన్నీ అత్తగారి వూరు గోవర్ధనపురానికి వెళ్లి నామాటగా చెప్పు," "మేము పెండ్లి వాళ్లమంతా అక్కడికే వచ్చి పెళ్లిచేసుకుంటాం. పెళ్లి కూతురుని మన్నీ అత్తగారు వారింటికి పిలువనంపాలి. మిగతావిషయాలు నావద్దకు వచ్చి, మాట్లాడివెళ్లమని చెప్పు."

నాయీ బ్రహ్మణుడు ఆ సందేశం తెల్పి బంధువులకు ఆహ్వానం చెప్పడానికి వెళ్లాడు.

బిల్లేసురుడి పటాటోపం హద్దు దాటిపోతోంది, మరో వూరినుండి ఒక బండి తెప్పించాడు. అతనితో వ్యవహారం కలిగివుంటే ఏనాటికైనా మంచి

దని బండి యజమాని బండి పంపాడు. బిల్లేసురుడు స్వయంగా పిండి మిషనుకెళ్లి గోధుమపిండి పట్టించుక వచ్చాడు. గ్రామంలో పనిపాటలులేని విధవలంతా పప్పు దినుసులు తయారు చేశారు. నూనె వ్యాపారి మల్ఖానును కాన్పూరుకు వెళ్లి చక్కెర కొనుక్కురావలసినదిగా పంపాడు. బట్టలు, యితరసామాన్లు గ్రామంలోని సాలెవాళ్లు, నూనెవ్యాపారి, ఆకులవ్యాపారి, చర్మకారుల వద్ద కొన్నాడు. ఇక యింటి సమస్య అతన్ని బాధించేది. బంధువులొస్తే మేకలతో సహజీవనం సాధ్యంకాదు గదా! కానీ ఆ సమస్య కూడా చాలా సులభంగా తీరిపోయింది. ఎదురు యింటి చౌదరి విధవ పత్ని ఒకగది తనకు అట్టిపెట్టుకొని మిగిలిన యిల్లంతా రెండురోజులు బిల్లేసురుని పరం చేస్తానని మాట యిచ్చింది.

బంధువులు రాసాగారు. చౌదరీగారి యింటిలో బస ఏర్పాటుచూచి అంతా ఆశ్చర్యపోయారు.

తనకు కావలసిన కంటె, మోహనమాల, ఉంగరం యీలాంటి బంగారు వస్తువులు యితరుల నుండి అడిగి తెచ్చుకున్నాడు. వడ్డీ వ్యాపారస్థుడు మురళీకి వడ్డీ చెల్లించేందుకు అతను ఏమాత్రం వెనుకాడలేదు. అతను కూడా బిల్లేసురుని మహాత్మ్యం వినియున్నాడు. పెళ్లి కుమార్తెకు కావలసిన నగలు మాత్రం బిల్లేసురుడు రూపాయకు రెండణాలు అనగా ఎనిమిదవ వంతు నగదు చెల్లించి దొంగల వద్దకొన్నాడు. ఆ తర్వాత వాటిని కంసాలి యింటికి పంపి మెరుగు పెట్టించాడు. అయితే కడియాలు కాళ్ల అందెలు యిలాంటి కొన్ని వస్తువులు మాత్రం చెడగొట్టకుండా ఆలాగే ఉపయోగించాడు.

తైలస్నానం రోజు వాద్యయంత్రాల ధ్వనితో ఆ గ్రామం ప్రతిధ్వనించింది. బిల్లేసురుని అదృశ్య వైభవ సంపద ప్రభావం అందరి మీద బాగా ప్రసరించింది. ప్రక్కగ్రామం జమీందారుగారు కచేరినుండి యింటికి వెళుతూ బిల్లేసురుని యింటి మీదుగా బయలు దేరాడు. బిల్లేసురుని చూచి నమస్కరించాడు. కారణం ఏమంటే బిల్లేసురుకు లంకెబిందెలు దొరకినట్లువిన్నాడు. ఆ విషయం స్ఫురణకురాగా ఏనాడైనా అతనితో పని కలగవచ్చని అభిప్రాయంతో తన వంతు సహాయం అందించాలనే యిలా అన్నాడు - "ప్రజల చూపులు వారి వ్యవహారాన్ని బట్టి మేము కొన్ని రహస్యాలు పసికడుతూ వుంటాం. నీవు వివాహం చేసుకోబోతున్నావని విన్నాం. ఆరోజు ఊరేగింపుకు మా గుర్రం కావలసివస్తే నిస్సంకోచంగా తీసుకవెళ్లు."

బిల్లేసురుడు తన గుట్టును ఏమాత్రం బయలు పరచక వినయంగా

జవాబిచ్చాడు - "మేం పేద బ్రహ్మలం. బ్రాహ్మణుల ఆచారాలనే పాటిస్తాం. మీరు మారాజులుగదా! ఏమైనా యివ్వగలరు." జమీందార్ ఠాకుర్ సాహెబ్ గారు బిల్లేసురుని చమత్కారం, చాలాకీ తనానికి మందహాసం చేసి మరొక పర్యాయం నమస్కరించి అక్కడనుండి వెళ్లి పోయాడు.

మాతృపూజ మరుసటి రోజున పెళ్లి జనం బయలుదేరారు. నుయ్యి పూజింపబడింది. బిల్లేసురుడి ఒక పిన్నమ్మ అతడికి పాలగ్లాసుతో పాలు త్రాపింది. ఆచారప్రకారం కానుక కొరకు ఆమె బావి అరుగు కట్టడం మీద కూర్చుని కాళ్లు వ్రేలాడవేసుకొని హఠంచేస్తూ అలాగే వుండిపోయింది. అలా ఎందుకున్నావని అందరు ప్రశ్నించారు. అప్పుడామె "నేను పెళ్లికుమారు నితో బంగారు యిటుక తీసుకొనే బావి అరుగుమీద నుండి దిగుతానన్నది." గ్రామస్థులు ఆమెను సమర్థిస్తూ "ఆమె కోరడం సహజమేకదా! బిల్లేసురుడు కూడ బెట్టన సొత్తు మరెప్పుడు కానుకలిస్తాడు?" బిల్లేసురుడు ఆమెను బుజ్జ గిస్తూ, "పిన్నిగారు! ప్రస్తుతం యిక్కడ నేను అసహాయుణ్ణి. కార్యంకాగానే నీవుకోరినట్లే యిటుక యిస్తానులే!" అన్నాడు. పిన్నిచాలా సంతోషించింది. గ్రామస్థుల ఆశ్చర్యానికి అంతులేదు. బిల్లేసురుని వద్ద డజన్లకొద్ది బంగారు యిటుకలున్నాయని భావించారు.

పెళ్లి గుంపు బయలు దేరింది. ఆచారం ప్రకారం అన్నీ సాంగ్యాలు యధావిధిగా ఆచరింపబడ్డాయి. నాలుగు రోజుల అనంతరం బిల్లేసురుడు తన భార్యతో యిల్లు చేరుకున్నాడు. ఆ తర్వాత అతను జీవించినంత కాలం అతను ధనవంతుడైన రహస్యం ఏనాడు బయటకు పొంగ నివ్వలేదు. ఆ రహస్యాన్ని ఆలాగే గుట్టుగా వుంచగలిగాడు.

Laserset at Printofast, 11/4 Old Rajinder Nagar, New Delhi - 110060 and printed at J.J. Offset Printers, Wazirpur, Delhi - 110035